శ్రీః

ఓం శ్రీ హయగ్రీవాయనమః

# భాగవత చతుశ్శ్లోకీ

సంస్కృతవ్యాఖ్య
శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్రుడు
ఆంధ్రానువాద 'చాతురీ' వ్యాఖ్య
మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి
మన్త్రవ్యాఖ్య
దోర్బల విశ్వనాథశర్మ





ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి

వెల : రూ. 20-00

శ్రీః

ఓం శ్రీ హయగ్రీవాయనమః

# భాగవత చతుశ్శ్లోకీ

సంస్కృతవ్యాఖ్య

శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్రుడు

+

ఆంధ్రానువాద 'చాతురీ' వ్యాఖ్య

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

+

మన్త్రవ్యాఖ్య

దోర్బల విశ్వనాథశర్మ



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

వెల : రూ. 20-00

# భాగవత చతుశ్శ్లోకీ

సంస్కృతవ్యాఖ్య:
**శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్రుడు**

ఆంధ్రానువాద  చాతురీ వ్యాఖ్య:
**మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి**

మన్త్రవ్యాఖ్య:
**దోర్బల విశ్వనాథ శర్మ**

ప్రథమ ముద్రణ:- 19-08-2003 - శ్రీకృష్ణజయంతి
ప్రతులు : 1000
పేజీలు : 64
వెల రూ. : 20-00



DTP by
**Vikram Graphics**
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 237658

Printed at
KAMALA ART PRINITERS, Tenali.
Ph : 225072, 224472.

# పీఠిక

1. 'యః పూజయన్ స్వశతపత్ర సహస్ర పత్రైః
   రమ్యాక్షరైః వివిధవర్ణఘనైః హయాస్యమ్।
పుంజీకృతైః చరణసారసయోః అముష్య
   బందీకృతత్వ మివ భక్తిగుణేన తేనే'॥

2. 'గండూషామాస శాస్త్రప్రకర మయ మహో బిందవో యస్య భూతాః
   గ్రంథాః, అస్మాదృశానాం భవదవదహనాపోహదక్షా అభూవన్
మధ్యే మధ్యే కవిత్వప్రచురమనుచరాః కావ్యగాధామధూళ్యః
   అత్రాముత్రస్థతృష్ణాద్వయమపి సహసా చారు ముష్ణంతి రుచ్యాః॥

3. హయగ్రీవస్వామిప్రవరవరదత్తాత్మధిషణా
   ప్రవాహస్రోతోభిః విరచయతి విజ్ఞానసరసీః।
చిరంతు స్వారస్యద్రుతిషు సహ రంతుం హి సహజైః
   యథా శ్రీకీటోయం వయతి కవయత్యక్షరజగత్॥

4. సోయం రామకవిః విరించనసమ స్సంకల్పమాత్రక్షణే
   క్రీడాయాఇవ సృష్టవాన్ రసమయం గ్రంథప్రపంచం లఘు।
తేన శ్లోకచతుష్టయీ భగవతో వేదాంత సంగ్రాహికా
   వ్యాఖ్యాతాద్య మయా మయాంధ్రవచనే ఛాయా కృతా 'చాతురీ'॥

ఈ 'చతుశ్శ్లోకీ' వ్యాఖ్యను అవగాహన చేసికొనుటకు కొన్ని విషయములు ఇచ్చట వ్రాయుచున్నాను.

1. ఉన్నది బ్రహ్మమే. మఱేదియులేదు. ప్రపంచము అనునది నిజముగా లేదు. కాని ఉన్నదని అనిపించుచున్నది. ఈ 'అనిపించడం' మాయ వలననే. ఉదాహరణ:- ఉన్నదంతా మట్టి మాత్రమే కాని కుమ్మరి నైపుణ్యము వలన మధ్యలో కొంత 'మట్టి' గుండ్రనిరూపముసంతరించికొని 'కుండ' అను పేరును సంపాదించుకొన్నది. నిజమునకు 'మట్టి' యీ కుండకన్న ముందు ఉన్నదే, తరువాత ఉన్నదే. కుండతో వర్తమానంగానూ ఉన్నదే. అసలు 'కుండ' యందు గూడా ఉన్నదే. కనుక 'కుండ' అనేది కల్పన. దానినామరూపములు కల్పన మీద వచ్చిన కల్పనలే. 'కల్పన, అంతయు మిథ్యయే' ఈ కల్పనలకు కారణము 'కుమ్మరి' వాని నైపుణ్యము లేదా 'మాయ'. దీనికి రూపము లేదు. కాని ప్రభావము 'ఎఫెక్ట్' ఉన్నది. అదే 'కుండ' అను నామరూపములు. దీనిని బట్టి 'మాయను' శక్తిని, నైపుణ్యమును ఊహించుచున్నాము. ఈ మాయ 'కుమ్మరి' కన్న భిన్నమయినది కాదు.

2. అట్లే బ్రహ్మమునందు మాయకలదని ఊహించుచున్నాము. దానివలన 'ప్రపంచము' కనబడుచున్నదని సిద్ధాంతము. మాయవలన కనబడు ప్రపంచమున్ను మాయికమే అసత్యమే. నామరూపములు తప్ప ఇందు వాస్తవము ఏమియులేదు. బ్రహ్మమే వాస్తవము.

3. ఆధ్యాత్మికముగానే గాక భౌతికముగా చూచినను ఈ శరీరములన్నియు కల్పితములే. రక్త, మాంస, అస్థి, ద్రవముల సమ్మేళనములే కదా! అయినను నామరూపములలో భేదమున్నది కదా. ఈ భేదము వస్తువులో లేదు కనుక వాస్తవము కాదు. కనబడుచున్నది కనుక అవాస్తవము కాదు.

4. ఒక 'తాను' వస్త్రము తెచ్చి లాగులు చొక్కాలు, డ్రాయర్లు, అంగీలు, లుంగీలు, బనీనులు బాడీలు కుట్టెదము. ఇందలి అసలు పదార్థము ఒక్కటే. అదే వస్త్రము. కాని నామరూపములు అనేకము. ఇవి కల్పితములే కదా! అట్లే ఒక్కటే బ్రహ్మము. అందే ఈ నామరూపములు కల్పితములు. అవాస్తవములు. కనబడుచున్నవి కనుక వాస్తవములు.

5. ఈ 'వాస్తవ-అవాస్తవము' లయినవి అనిర్వచనీయములు-అనగా మిథ్యలు. కల్పితములు. బ్రహ్మము ఒక్కటే 'తత్త్వము' వాస్తవము. అకల్పితము.

6. ఉదాహరణములందు మట్టి- కుమ్మరి, వస్త్రములు-దర్జీ, వేఱుగానున్నారు. ప్రస్తుత విషయమునందు 'బ్రహ్మము' తప్ప వేఱేమియులేదు. ఆయనయే వివర్త కారణము. ఆయన మాయయే ఉపాదాన కారణము. ఆయనయే ఈ మొత్తం కల్పనలకు ఆధారము. ఈ తేడాను గమనింపవలయును.

7. నామరూపాత్మకమయిన యీ ప్రపంచము మనకు కనబడే దశలో 'స్థూలము' అందురు. మనకు కనబడని ప్రలయదశలో 'సూక్ష్మము' అందురు. ఈ '2'కి, కారణమయిన 'మాయ' ను 'పరము' అందురు.

ఉదాహరణ:-

1. నల్లని నెగటివ్ - మాయ/అవిద్య/పరము/ప్రకృతి/ప్రధానము/శక్తి
2. దానిలోని దృశ్యము - సూక్ష్మ ప్రపంచము, ప్రలయదశ
3. దృశ్యము, ప్రత్యక్షమయిన దశ - స్థూలము/ప్రపంచము/ఫోటో/సినిమా
4. లేదా, బ్రహ్మము ఒక 'టేప్ రికార్డర్' వంటిది అనుకొందము. బ్రహ్మము నందు లీనమయి 'మాయ' ఉండును. అనగా - 'కాసెట్టు' వలె ఉండును.

మాయ యందు సూక్ష్మ ప్రపంచము ఉండును. అనగా రీలు, అందులో ఛాయాచిత్రము ఉండును. సూక్ష్మ ప్రపంచము సృష్టికాలమునందు, ఆకాశమున స్థూలముగా కనబడును అనగా రీల్‌లో ఛాయాచిత్రము ఫోటో ప్రింట్‌లో సినిమాతెఱలో స్థూలముగా రంగులు రంగులుగా స్పష్టముగా గోచరించును. 'రీలు' అయిపోవడం = సృష్టి ప్రళయము కావడం. సూక్ష్మప్రపంచము గల మాయ భగవంతునిలో లీనమగును. అనగా 'కాసెట్టు' టేప్ రికార్డరులో నిలిచి పోవును. సినిమారీలు డబ్బాలో ఉండిపోవును.

8. ఇచ్చట గమనింపవలసిన ఒక తేడా కలదు. భగవంతునిలో ఈ సూక్ష్మ ప్రపంచము లేదు. 'మాయ' లో కలదు. 'మాయ' భగవంతునిలో కలదు. పరంపరయా భగవంతుని యందు ఈ ప్రపంచమున్నట్లు వ్యవహారము. ఒక ఉదాహరణము. మంచము మీద పరుపు, పరుపుపైన బెడ్‌షీట్ దాని మీద వ్యక్తి శయనించెను. నిజానికి ఆవ్యక్తి శయనించినది బెడ్‌షీట్ మీదనే. అయినా పరుపు మీద శయనించాడు అని అనడం లోక వ్యవహారము. అట్లే ప్రపంచ మంతా మాయలో లీనమయినా భగవంతునిలో లీనమయినట్లు అనడం రివాజు.

9. ఒక ప్రశ్న – ఎటూ 'మాయ' భగవంతునియందే లీనమయినది కనుక దానిలోని 'సూక్ష్మ ప్రపంచము' భగవంతుని యందే లీనమయినదనటానికి ఎందుకు సంకోచము అని. అలా అన్నచో సర్వజీవులు ప్రళయకాలమున భగవంతునిలోనే కలియునని అర్థము వచ్చును. భగవంతునిలో కలియుట అనగా ముక్తియే కదా! అట్లు సర్వజీవులకు పాపపుణ్యములతో నిమిత్తములేక భగవంతునితో ఐక్యము, అనగా ముక్తి వచ్చినచో, వేదము ముందు చెప్పిన కర్మకాండ దాని ఫలితమయిన స్వర్గాదిలోకములు అసత్యములు కావలసివచ్చును. కనుక జీవులు మాయయందే లీనమగుదురు. 'మాయ' సృష్టియందు ప్రవర్తింపగనే ఆ 'చుట్ట'ల నుండి 'సినిమా బొమ్మలవలె' విశ్వము, జీవులు ప్రత్యక్ష మగుదురు.

10. మఱొక ప్రశ్న – 'మాయ' భగవంతునిలో లీనమయినపుడు దానిలోని జీవులు మాత్రము లీనము కారా అని. కారు అని సమాధానము. ఉదాహరణ:– అతి చల్లగా ఉన్న 'పాలప్యాకెట్టు'ను నీటిలో పడవేసెదము. అంటే ఇచ్చట నీరు=బ్రహ్మము. పాలు=ప్రపంచము. పాకెట్టు=జీవులను ఆవరించిన మాయ. నీళ్ళలో పాలు లీనమయినచో మోక్షమే. అట్లు కాకుండగా అపునది 'మాయ' అదే 'పాకెట్టు'. కనుక మాయ ద్వారా భగవంతునియందు అణగియున్న ప్రపంచము 'మాయ' తో మఱల స్థూలముగా మారును.

11. మఱొక ప్రశ్న – ప్రళయకాలములో భగవంతునితోబాటు మాయ అందులో లీనమయిన ప్రపంచము కలదని తెలినది కదా! మఱి అద్వైతులు 'భగవంతుడు' ఒక్కడేయని, ఆయనకు తోడుగా (Company) ఎవరునులేరని, ఇదంతా ఆయనయే అని ఏల చెప్పెదరు. ఇంతకన్న వైష్ణవులు చెప్పిన మాట బాగున్నది కదా! భగవంతునకు ప్రకృతి, జీవులు ఎల్లపుడు తోడుగానుండెదరని భగవంతుడు సర్వవ్యాపి అనగా 'అంతర్యామి' అని వారు చెప్పెదరు – అని సమాధానము. 'మాయ' అనునది అనిర్వచనీయము ప్రపంచము అనునది అనిర్వచనీయము. అనిర్వచనీయమనగా లేకపోయినను ఉన్నట్లు అనిపించేది. ఇటువంటిది 'మాయ'. దానివలన వచ్చిన ప్రపంచమున్ను. అస్తిత్వములేని ఈ '2' భగవంతుని కేమి 'తోడు' ఇవ్వగలవు. మఱియు, 'మాయ' అనగా భగవంతుని శక్తి. 'శక్తి' అనేది విడిగా ఉండే గుణము కాదు. అది స్వరూపములోనిదే. దానికి

ప్రత్యేకరూపము లేదు. ప్రభావము వలన ఊహిస్తాము. కనుక అది 'తోడు' అని చెప్పరాదు. 'నేను' నాశక్తి వస్తున్నాము, 'ఇంజనీరు, ఆయన మనసులోని ప్లానులు, వస్తున్నాయి' అనము గదా! కనుక 'మాయ' వలన ప్రపంచము వలన (అవి సత్యము కావు) బ్రహ్మమునకు 'ద్వైతము' రాదు. కాని వైష్ణవ మతములో, తత్త్వత్రయము గలదు. (1) చిత్తు=జీవుడు, (2) అచిత్తు=జడ ప్రపంచము, (3) ఈశ్వరుడు=బ్రహ్మము. ఈ '3' ను నిత్య సత్యములే. కనుక వారికి 'జీవులు బ్రహ్మములో లీనమగుట' లేదు. వారికి బ్రహ్మము 'చిత్, అచిత్' లతో విశిష్టుడు అనగా కలిసియున్నవాడు. కనుకనేవారు 'విశిష్టాద్వైతము' అందురు. అద్వైతములో ప్రపంచము అంతా మాయ కనుక 'మాయ' 'మిథ్య' కనుక 'బ్రహ్మము' సూక్ష్మ ప్రపంచముతో కలిసియుండుట అన్న ప్రశ్నయే లేదు. స్థూల ప్రపంచమయినను భ్రాంతియే కనుక భగవంతునకు సృష్టిదశలోను ప్రపంచ సంగము లేదు. కనుకనే అద్వైతులకు భగవంతుడు 'సర్వవ్యాపి, లేదా సర్వము' - అంతే. 'అంతర్యామి' కాదు. అయితే - గియితే, 'వ్యవహారదశలో అట్లు అనుకొనవచ్చును. కనుక అద్వైతమే. ద్వైతము లేదు.

12. వైష్ణవులకు 'లయ' రూపమయిన, మోక్షము లేదు. అద్వైతులకు 'లయ' రూపమయిన మోక్షము కలదు. 'లయ' మనగా 'నీటిచుక్క' నీటిలో కలిసినట్లు 'చిదాభాసుడు', 'బ్రహ్మము' నని తెలిసికొని 'బ్రహ్మము' అయి పోవుటయే. ఈ 'లయము' ఎట్లు సాధ్యము? దానికి సమాధానము-'మాయ' జీవులను 'అజ్ఞాన' రూపంగా నిద్రారూపంగా ఆవరించియుండును. ఎంత వేదాంతము చదివినను, బ్రహ్మ జ్ఞానము రాదు. ఎంతగా ఆనందమయ కోశములోకి పోయినను 'నిద్ర' మనలను 'బ్రహ్మము' లో కలువనీయదు. ఒక కవచము వలె మనను వేఱుచేసి ఉంచును. ఈ మాయాకవచము అజ్ఞానులకు మందముగా త్రిగుణాత్మకముగా నుండును. జ్ఞానులకయినను జీవన్ముక్తుల కయినను ఈ 'మాయ' పారదర్శకంగా సత్త్వప్రధానంగా ఉండును. అందువలన జీవన్ముక్తులకు 'మాయ' ఉన్నను ప్రతిబంధకము కాలేదు. మనలను 'చర్మ వస్త్రము' వలె దట్టముగా కప్పియుండును. దీనిని తొలగించికొనుట ఎట్లు?

13. అందుకే యీ 'చతుశ్శ్లోకీ'. ఇందు మొదటి శ్లోకమున, భగవంతుడు తన అఖండతత్త్వమును, అనాద్యనంత స్థితిని, రెండవ శ్లోకమున తన 'మాయ' వైభవమును, మూడవ శ్లోకమున, తన అంతర్యామిత్వమును సర్వవ్యాపిత్వమును లేదా సర్వత్వమును చెప్పి, నాల్గవ శ్లోకమున జ్ఞానార్థుల కర్తవ్యమును మనన విధానములను అనుగ్రహించెను.

ఇట్లు

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి
సంస్కృతాధ్యాపకుడు - గోరంట్ల వెంకన్న సంస్కృతకళాశాల
అమృతసముద్రము

ఓం శ్రీ హయగ్రీవాయనమః

# భాగవత చతుశ్శ్లోకీ

శ్రీమద్భాగవతే ద్వితీయస్కంధే నవమాధ్యాయే బ్రహ్మాణం ప్రతి సాక్షాద్భగవతోపదిష్టం చతుశ్శ్లోక్యాత్మకం భాగవతం యథామతి రామేణ వ్యాఖ్యాయతే తథాహి।

## ఆంధ్రానువాద వ్యాఖ్య - 'చాతురీ'

* * *

శ్రీమద్భాగవతమున ద్వితీయస్కంధమున నవమాధ్యాయమున భగవంతుడు నారాయణుడు ప్రత్యక్షముగా బ్రహ్మకు ఉపదేశించిన ఈ **'4' శ్లోకముల భాగవతమును** 'రామ' పండితుడు తనకు తోచిన రీతిగా వ్యాఖ్యానము చేయుచున్నాడు.

**శ్లో॥** అహమేవాసమేకోఽగ్రే
నాన్యద్యత్సదసత్పరమ్।
పశ్చాదహం యదేతచ్చ
యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్॥ **1**

**ప్రతిపదార్థము:-** అగ్రే=సృష్టికి పూర్వము, అహమ్=పరమాత్మనయిన నేను, ఏకఏవ=ఒక్కడనే, ఆసమ్=ఉంటిని, యత్=ఏదయితే, సత్=స్థూలముగానున్నదో, అసత్=సూక్ష్మముగానున్నదో, పరమ్=కారణరూపమయిన మాయాస్వరూపముగానున్నదో, అన్యత్=అటువంటిది వేఱేదియు, న=లేదు, పశ్చాత్=సృష్టికి తరువాత, యదేతత్చ=స్థూల సూక్ష్మరూపమయిన యీ ప్రపంచము ఏదిగలదో అది అంతయు, అహమ్=నేను, యః=ఎవరయితే, అవశిష్యేత=ప్రలయము తర్వాత మిగులునో, సః=అతడు, అహమ్=నేను, అస్మి=అగుదును.

**తాత్పర్యము:-** సృష్టికి పూర్వము నేనే ఉంటిని. అప్పుడు స్థూల సూక్ష్మ కారణ రూపమయిన ఈ ప్రపంచము ఏదియును భిన్నముగా లేదు. సృష్టి తర్వాత

కనబడుచున్న యీ స్థూలసూక్ష్మ స్వరూపమయిన యీ ప్రపంచమంతయును నేను. ప్రలయానంతరము అన్నియును అదృశ్యము కాగా మిగిలియుండునదియు నేనే. అనగా త్రికాల సత్యము పరమాత్మ. మధ్యలో వ్యక్తమయిన ప్రపంచము పరమాత్మకన్న భిన్నమయినట్లు తోచును గాని అదియును పరమాత్మయే.

**వ్యాఖ్యా-1 :- అగ్రే సృష్టేః ప్రాక్కాలే, అహం పరమాత్మాహం, ఏక ఏవ ఆసమ్ స్థితః అన్యత్ కించిదపి న నాస్తి. కిం తదన్యదిత్యత ఆహ-యత్ సత్ నామరూప విభాగార్హతయా స్ఫుటప్రతీతి విషయం స్థూలమ్. అసత్ నామరూప విభాగానర్హం సూక్ష్మమ్.పరమ్ స్థూల సూక్ష్మకారణభూతం మాయాపరపర్యాయం ప్రధానమ్. తదన్యత్కిమపి నే త్యన్వయః. పశ్చాత్ సృష్టేః అనంతరం, ప్రపంచ దశాయా మిత్యర్థః. యదేతత్ స్థూలసూక్ష్మాత్మకం విశ్వ మస్తి తదప్యహమేవ. ప్రళయే యః అవశిష్యేత సోప్యహమేవాస్మి. ప్రపంచస్య ఆదిమధ్యావసానేషు అహ మేక ఏవ స్థితః. అతః పరిపూర్ణోహమ్. ఇదన్తు జగత్ నాదౌ వర్తతే. నాన్తే వర్తిష్యతే. కిన్తు మధ్యే కేవలం భాతి తదిదమప్యహ మేవ. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇతి శ్రుతేః. ఘటోదయాత్ప్రాక్, ఘటనాశే కపాలావస్థాయాం చ అనువర్తమానః మృదంశ ఏవ ఘటదశాయామపి వర్తమానస్సన్ 'ఘట' ఇత్యుచ్యతే. తద్వత్ బ్రహ్మాపి జగద్దశాయాం జగదిత్యుచ్యతే ఇతి భావః.**

**చాతురీ-1 :-** సృష్టికి పూర్వము నేను పరమాత్మగా ఒక్కడనేయుంటిని. భిన్నముగా ఏదియును లేనే లేదు. నామరూపములతో 'ఇది ఘటము' ఇది వస్త్రము. అని చెప్పదగినది స్థూల ప్రపంచము. ఇది 'సత్'. నామరూపములతో 'ఫలానా' అని చెప్పవీలులేని సూక్ష్మ ప్రపంచము ఏదయినను 'అసత్'. ఈ '2' ప్రపంచములకు కారణమయిన 'మాయ' పరము. ఈ '3'న్ను అనగా సత్తు= స్థూలము, అసత్తు=సూక్ష్మము, పరము=మాయ - అనునవి ఏవియును సృష్టికి పూర్వము లేవు. సృష్టితర్వాత అనగా ప్రపంచము ఏర్పడిన ప్రస్తుతదశలో స్థూల సూక్ష్మ స్వరూపమయిన యీ దృశ్యమంతయు నేనే. ప్రళయము తరువాత మిగులునదియు నేనే. కాగా ప్రపంచము యొక్క ఆది, మధ్య, అంతములందు లేదా సృష్టి స్థితి ప్రళయములందున్ను నేను ఒక్కడనే. కనుక నేను 'పరిపూర్ణుడను'.

ఈ ప్రపంచము మొదట లేదు. చివఱ లేదు. మధ్యలో మాత్రమే

కనబడుచున్నది. వ్యక్త మధ్యము అని అర్థము. కనుక ఇదియంతము నేనే. 'సమస్తము బ్రహ్మమే' అని వేదవాక్యము. ఏమనగా, 'కుండ' తయారు కాకముందు, తయారవుతున్న 'డిప్పల' దశలోను, తయారయిన తర్వాత, పగిలిన తర్వాత గూడా సమానముగానున్నది 'మట్టి' అను అంశమే. కాకపోతే 'కుండ' గా ఉన్న దశలో 'మట్టి' అనబడదు. 'కుండ' అని పిలువబడును. అట్లే బ్రహ్మము జగత్తుకు ముందు వెనుకల మధ్యన ఉండును. కాని మధ్యలో 'జగత్తుగా' వ్యవహరింపబడును. కనుక సమానముగా అన్నిదశలలోను ఉన్నది 'బ్రహ్మ' మే అనగా నేనే అని నారాయణుని ఉపదేశము.

వ్యాఖ్యా-2 :- స్యాదేతత్ (1) నను బీజాంకురన్యాయాపత్తేః సృష్టేః అనాదిత్వం సూత్రకారైరేవాంగీకృతమ్-ఇతి కృత్వా సృష్టేః ప్రాగిత్యుక్తి రయుక్తా, (2) సూక్ష్మావస్థాపన్నస్య చేతనాచేతనాత్మకస్య ద్వైతస్య తదానీమపి సత్త్వాత్ ఏకఏవేత్యుక్తి రయుక్తా, (3) 'ఈక్షతేర్నా శబ్దమ్' ఇత్యనేన ప్రధానాఖ్యస్య తత్త్వ స్య నిరాకృతత్వాత్ పరం ప్రధాన మిత్యుక్తిశ్చ న యుక్తా, (4) ప్రధానం నామ నాతిరిక్తం తత్త్వమ్. కింతు మాయైవ ఇతి చేత్ తర్హి మాయాయాః పరమాత్మాన న్యత్వాత్ తస్యా అన్యత్వోక్తిః వ్యాహతా, (5)అనృత జడ దుఃఖాత్మకస్య జగతః సచ్చిదానందలక్షణస్య పరమాత్మనశ్చ అత్యన్తం భేదాత్ జగదహమేవేతి సామానాధికరణ్యవచనం చాయుక్తమ్, (6) ప్రళయేపి న జగతః సర్వాత్మనా నాశః, సూక్ష్మరూపేణ తదానీమపి జగతః సత్త్వాత్, అన్యథా ప్రళయే సర్వేషా మపి ముక్తిః సులభైవేతి 'నాన్యః పన్థా విద్యతేఽయనాయ' ఇతి శ్రుతిః వ్యాహన్యేత -ఇతికృత్వా పరమాత్మన ఏకశేషత్వోక్తిశ్చ విరుద్ధా, (7) కిఞ్చ 'అహ' మేవ ఇతి బ్రువతా భగవతా 'దేవదత్తోహమ్, యజ్ఞదత్తాత్ ప్రాగాసమ్' ఇతివత్ 'అహం' పదేన దేహావచ్ఛిన్నస్య వివక్షితత్వే తస్య స్థూలత్వేన స్థూలసూక్ష్మాభావోక్తిః న సంగచ్ఛతే, (8) కూటస్థస్య వివక్షితత్వే తు తస్య వచనమేవ వ్యాహన్యేత, వికారాపత్తేః, న హి నిర్వికారం వస్తు 'అహమాస' మితి వాగ్రూపేణ విక్రియేత, (9) కిఞ్చ, తత్తజ్జీవసాక్షిణామ్ కూటస్థానామ్ బహూనామ్ ప్రళయేపి సత్త్వాత్ 'అహమేక ఏవ' ఇతి ఏకత్వవచనమ్ న యుక్తమ్, (10) అపిచ 'నత్వేవాహమ్ జాతు నాసమ్ న త్వమ్ నేమే జనాధిపాః, న చైవ న భవిష్యామః, సర్వే వయ

**మతః పరమ్, ఇతి గీతా వాక్యాత్ స్వీయాదేవ ఇదం వాక్యం ప్రతిహన్యతే. తత్ర సర్వేషాం సర్వదాపి సత్త్వస్య ప్రతిపాదితత్వాత్ ఇతి పూర్వపక్షాః.**

**చాతురీ-2 :-** అదంతాసరే, (1) 'సృష్టికన్నముందు' అని యిచ్చట భగవద్వాక్యము. సృష్టి అనాది కదా! బీజమునుండి మొలకవచ్చినట్లు భగవంతుని నుంచి సృష్టివచ్చినదని సూత్రకారులు అంగీకరింపలేదు. 'సృష్టి' అనాది అని వారు అంగీకరించిరి. కనుక 'సృష్టికి' ముందు, అనుమాట చెల్లదు, (2) భగవంతుడు 'తానొక్కడనే' అని చెప్పుటయుకుదరదు. ఏమనగా సూక్ష్మరూపము దాల్చిన చేతనాచేతనములు (చిత్తు=జీవులు, అచిత్తు=ప్రకృతి, జడము) భగవంతుని యందు ఉండును కనుక ఆయన 'ఒంటరి' కాదు కదా! (గమనిక: వైష్ణవ మతము ప్రకారము సృష్టికి ముందు ప్రళయమునకు తర్వాత భగవంతుని యందు జీవజగత్తులు సూక్ష్మరూపముననుండును. సూక్ష్మచిదచిద్విశిష్టుడు. కనుక ఆయన ఒంటరివాడు కాడు. అద్వైత మతములో సృష్టి అంతయు మాయ కనుక మిథ్య కనుక భగవంతునియందెపుడునూ ఉండవు. కనుక భగవంతుడు ఒంటరియే.), (3) 'ఈక్షతేర్నాశబ్దం' అనుసూత్రములో ప్రధానము అనగా జడమయిన ప్రకృతి నిరాకరింపబడినది. (భగవంతుడు తాను సృష్టి చేయవలయునని ఈక్షించెను అనగా సంకల్పించెను-అని వేద వాక్యము. ఈ 'సంకల్పించుట' అనునది జ్ఞాన ధర్మము. కనుక భగవంతునిది సృష్టి సంకల్పము. ప్రకృతిది కాదు. అది జడము కనుక జ్ఞానము లేనిది కనుక దానికి సృష్టి సంకల్పసామర్థ్యములుండవు అని 'ఈక్షతేర్నా శబ్దమ్' అను సూత్ర భావము) కనుక నిరాకరింబడిన 'ప్రకృతి' ని మఱల లేదని క్రొత్తగా చెప్పుట అనవసరము, (4) ప్రధానము అనగా ప్రకృతి అనగా మాయ ప్రత్యేక తత్త్వము కాదు. అది మిథ్యయే. మాయయే. అన్నచో ఆ 'మాయ' పరమేశ్వరుని కన్న భిన్నమయినది కాదు గదా! పరమేశ్వర వాక్యములో అనగా పై శ్లోకములో నాకన్న భిన్నమయిన మాయ (పదము) గూడా సృష్టికి ముందు లేదు అని చెప్పుట అసంగతము. ఆయనకన్న అది ఏనాడును భిన్నముకాదు గదా! అది సృష్టికి ముందు లేదని చెప్పినను తప్పే. భిన్నముగా ఉన్నదనినను తప్పే, (5) ప్రపంచము అసత్యము జడము దుఃఖమయము. పరమాత్మ సత్యము జ్ఞాన స్వరూపుడు ఆనంద

మయుడు-ఇంతగా భేదమున్నపుడు, పరమాత్మ పై శ్లోకములో 'ప్రపంచము నేనే' అని యేల చెప్పెను, (6) ప్రళయమందు ప్రపంచము పూర్తిగా నశించును. (మనిషి చచ్చినను ఆత్మ మిగిలినట్లు స్థూలరూపము నశించినను ప్రపంచ సూక్ష్మరూపము నశింపదు. మొత్తము నశించును అన్నచో అప్పుడు సర్వజీవులకు ఊరకయే ముక్తి లభించును అనిచెప్పినట్లగును. 'మోక్షమునకు జ్ఞానము తప్ప ఈశ్వరుడు తప్ప వేఱే మార్గము లేదు'. అను వేదవాక్యము నిలువని పరిస్థితి వచ్చును. కనుక ప్రలయముతో అందఱికి ముక్తి రాదు. కాబట్టి ప్రలయము నందయినను సూక్ష్మ ప్రపంచముండును. కనుక పరమాత్మకు తోడు సూక్ష్మ ప్రపంచము ఉన్నదన్నచో ఆయన ఒంటరిగా మిగులుట ఎట్లు సంభవించును?, (7) పైగా, భగవంతుడు ఈ శ్లోకమున 'నేను' అని చెప్పుచున్నాడు. 'నేను దేవదత్తుడను, యజ్ఞదత్తునికన్న ముందే ఉన్నాను' అన్నట్లుగా ఈ 'నేను' అనుపదము స్థూలదేహమును అందున్న ఆత్మను సూచించును. ఆ లెక్కన 'నేను' అన్న భగవంతుడు 'స్థూల' రూపుడని భావింపవలయును. అట్టిచో ప్రళయమునందు, సృష్టికి ముందు 'స్థూల సూక్ష్మములు' రెండునూ లేవని యెట్లు చెప్పెను. 'నేను' అనుచున్న తన స్థూలరూపము, అందలి సూక్ష్మరూపము కలవుకదా!, (8) 'నేను' అనగా శరీరము కాదు. అందలి కూటస్థుడయిన 'ఆత్మ' అని అర్థము. కనుక ఆత్మ స్థూలము కాదు. సూక్ష్మమున్ను కాదు. కనుక పై ఇబ్బంది లేదందురేమో? కాని ఇందులోను ఇబ్బంది కలదు. కూటస్థుడనగా ఎటువంటి వికారములు లేక అతీతముగా నిర్లిప్తముగానుండువాడని కదా అర్థము. అట్టివానికి ఎట్టి 'వికారము' ఉండరాదు. కాని 'నేను' అను శరీరాభిమానము, వాగ్రూపమయిన వికారము ఎట్లు కలిగినవి, (9) మఱియు, ప్రతిశరీరములందు సాక్షులు కూటస్థులు అయిన జీవులు అనేకులు గలరు. వారు నిత్యులు కదా ప్రళయకాలమందయినను వారు నశింపరు గదా! మఱి 'భగవంతుడు' 'ఒంటరి' గా ఎట్లుండును?

(10) అంతేకాక 'నేను లేకపోవుట కాదు. ఈ రాజులు లేక పోవుట కాదు. మనము అందఱము లేకపోవుట కాదు' అను గీతా వాక్యమును బట్టియు జీవులు అనేకులు, నిత్యులు అనియు 'మనము' అనుట వలన భగవంతునితోపాటు జీవులుండెదరని తేలుచున్నది. కనుక గీతలోని కృష్ణ

వాక్యము, పై నారాయణ వాక్యము విరోధించుచున్నవి కదా! ఇవి పూర్వ పక్షములు.

**వ్యాఖ్యా-3 :- అత్రోచ్యతే - నతావత్ గీతావచన విరోధః, ప్రకృతేన అహంపదేన బ్రహ్మణ ఏవ వివక్షితత్వేన, కూటస్థానాం చ తదనన్యత్వేన ఏకత్వవచన సంగతేః అత ఏవ న చేతనాచేతనైః ప్రళయే ద్వైతత్వం బ్రహ్మణః. తదా తేషాం మాయాలీనత్వేన అసత్ప్రాయత్వాత్.**

**చాతురీ-3 :-** ఈ పూర్వపక్షములకు మొత్తముగా సమాధానము చెప్పబడు చున్నది. గీతావాక్యముతో ఎట్టి విరోధమున్ను లేదు. భగవంతుడు 'నేను' అని చెప్పినది తనను గుఱించియే. 'తాను అనగా ఒక శరీరము అందులోని జీవుడు అని కాదు. 'నేను' అనగా సర్వ వ్యాపి అయిన బ్రహ్మమును అనియే అర్థము. కూటస్థులు చాలామంది లేరు. వారందఱు బ్రహ్మమే తప్ప వేఱుకాదు. శరీరములను బట్టి వేఱుగానున్నట్లు భ్రమ మాత్రమే. కనుక భగవంతుడు ఒక్కడే. ఈ కారణముచే 'నేను ఒక్కడనే నిలిచియుందును' అని భగవంతుడన్న వాక్యము వాస్తవమే. 'బ్రహ్మమొక్కటే, ఆ బ్రహ్మము నేనే' అని దాని సారాంశము.

ప్రళయమునందు 'చిత్తు, అచిత్తు' అనగా 'జీవులు-జడప్రపంచము' మీ మతము(వైష్ణవము) ప్రకారముండును కనుక ప్రళయకాలమున 'తాను ఒక్కడినే' అను మాట కుదరదని మీ అభిప్రాయము. కాని వాస్తవముగా అద్వైతమున 'బ్రహ్మము-తప్ప భిన్నముగా కనబడు విశ్వమంతయు మాయయే మిథ్యయే. కనుక జీవులు అనబడునవి ఆభాసములేకాని వాస్తవములు కావు. వీరందఱును మాయలోనే లీనమగుదురు. కనుక మాయలో లీనమయిన ఆ చేతనా చేతనములు లేనివానితో సమానము. కనుక భగవంతునికి తోడుగా అవి యుండినట్లు చెప్పరాదు. కనుక భగవంతుడు 'నేను ఒక్కడనే మిగిలి యుందును' అనుట సంభవమే.

**వ్యాఖ్యా-4 :- నాపి మాయయా ద్వైతత్వమ్, మాయాయాః స్వానన్యత్వాత్ అగ్న్యనన్యాగ్నిశక్తివదితి. తస్యా అన్యత్వోక్తి స్తు వ్యవహారబలాదితి.**

**చాతురీ-4 :-** అట్లయినచో చేతనా చేతనములు లేకపోయినను వానిని తనలో లీనము చేసికొనిన 'మాయ' కలదు కదా! అది భగవంతునకు తోడుగానున్నట్లే

కదా! ఆవిధముగానయినను 'నేను ఒక్కడనే మిగిలియుందును' అని భగవంతుడు ఎట్లనును? అని ప్రశ్న. సమాధానమేమనగా, మాయ భగవంతుని శక్తి. ఏశక్తి అయినను తన ఆశ్రయము కన్న భిన్నముగానుండదు. మన శరీరము ఒకచోట మన శక్తి మఱొకచోట ఉండదు గదా! అగ్నియున్నచోటనే అగ్నితోపాటే అభిన్నముగా అదృశ్యముగా అగ్నిశక్తి (దాహకత్వము) ఉండును గదా! కనుక మాయ వేఱుగా లేదు. అది భగవంతునియందే గలదు. కనుక దానివలన భగవంతునికి 'తోడు' లభించదు. నేను నా తమ్ముడు వచ్చాము అనుట కలదు గాని నేను నా చేయి వచ్చాము అనము కదా! కనుక భగవంతుడు 'ఒక్కడే' మిగిలి యుండును. భగవంతుడు, నా 'మాయ' అని విడిగా చెప్పుకొనుట 'నా శక్తి' అన్నట్లు వ్యవహారబలము వలన మాత్రమే.

**వ్యాఖ్యా-5 :- అయమాశయః, అగ్నిశక్తిః నాగ్నేః సత్తాన్తరమ్, అగ్నేః పృథక్ అనుపలభ్యమానత్వాత్. నాప్యగ్ని రేవేతి యుక్తమ్. మణి మంత్రాదిభిః అగ్నేః అవికృతత్వేపి శక్తేః ప్రతిబంధ సంభవాత్. అతః అగ్నేరనన్యాపి కార్యబలా దన్యేవ ప్రతిభాతి.**

**చాతురీ-5 :-** విషయమేమనగా, అగ్నివేఱుగా అగ్నిశక్తి వేఱుగా లేవు. కనుక అగ్నికి అగ్నిశక్తిని 'రెండవది'గా చెప్పరాదు. విడిగా దొఱకినచో చెప్పవచ్చును. అయితే అగ్ని తప్ప 'అగ్నిశక్తి' అనునది అసలు లేదనియు చెప్పరాదు. ఎందుకనగా మణి, మంత్రము, ఓషధులు మొదలగు వానివలన 'అగ్నిశక్తి' ప్రతిబంధింపబడుచున్నది. అగ్ని ప్రతిబంధింపబడుట లేదు. కనుక శక్తి విడిగాలభింపదు. కాని ఉన్నదిఅని తెలియుచున్నది. అగ్ని కన్న భిన్నముగా లేకున్నను కార్యబలము వలన అనగా తగులబెట్టుట మొదలగు వానివలన విడిగానున్నట్లు తెలియుచున్నది.

**వ్యాఖ్యా-6 :- ఏవమేవ మాయాపి బ్రహ్మణః అనన్యాపి అన్యేవ భాతీతి ఇదమేవ భానం వ్యవహారబలకృతమ్. అస్తి హి వ్యవహారః శాస్త్రీయః, 'మమ మాయా దురత్యయా' ఇతి మాయాయా అన్యత్వమ్. 'తత్తేజోఽసృజత' ఇతి సృష్టేః మాయాకార్యత్వాత్ బ్రహ్మణః తేజ స్సృష్టి కథనం మాయిత్వాంగీకారేణైవేతి బోధ్యమ్. అనన్యత్వం చ శ్రుతిస్మృతి ప్రసిద్ధ మేవ.**

**చాతురీ-6 :-** అట్లే మాయయు బ్రహ్మకన్న భిన్నమయినది కాదు. అయినను 'భిన్నముగా' నున్నట్లు వ్యవహారములో కనబడుచున్నది. అట్టి వ్యవహారమున్ను శాస్త్రమునందే కలదు. కనుకనే గీతలో 'నా మాయ దాటరానిది' అని భగవానుడే చెప్పెను. నా - మాయ అనగా మాయ విడిగానున్నట్లు వ్యవహారము గీతలో నున్నట్లే, 'అది తేజస్సును సృజించెను'. అని వేదము. ఇచ్చట 'అది' అనగా సందర్భమునుబట్టి బ్రహ్మమే అని అర్థము. కాని మొత్తము శాస్త్రమును బట్టి 'సృష్టి' కార్యమేదయినను 'మాయ' దే. కనుక బ్రహ్మము మాయతో సృష్టించెను. అని చెప్పవలయును. ఇట్లు వ్యవహార రీత్యా 'నా శక్తి' అన్నట్లు 'మాయ' విడిగా చెప్పబడుచున్నను అది 'మన శక్తి మనయందే అభిన్నముగానున్నట్లు' బ్రహ్మకన్న అభిన్నముగా నున్నదే. ఈ విషయము వేద శాస్త్ర ప్రసిద్ధమే. కనుక 'మాయ' భగవంతునిలోనిదే. ఆయనకు భిన్నముగా రెండవది కాదు. కనుక 'నేను ఒక్కడినే' అను హరివాక్యము సంగతమే.

**వ్యాఖ్యా-7 :- యదా ప్రకృతౌ చేతనా చేతనాత్మకం జగల్లీనం సద్వర్తతే తదా ప్రళయ ఇతి. యదా తు తత ఉత్థాయ స్ఫుటం భవతి తదా జగదితి చ సంకేతః. ఏవం స్థితే జగతః సాదిత్వ మనాదిత్వం సంగచ్ఛతే. స్థూలరూపేణా విర్భావకథనా త్సాదిత్వమ్. సూక్ష్మరూపేణ సర్వదా స్థితికథనాత్ అనాదిత్వం చేతి. అతః సృష్టేః పురేత్యుక్తిః యుక్తైవ.**

**చాతురీ-7:-** కాగా భగవంతునియందు అభిన్నముగా ఆయన శక్తి అయిన 'మాయ' యుండును. అదే ప్రకృతి. దానియందు ఈ చేతనా చేతన ప్రపంచము లీనమయి యుండును. ఇదే ప్రళయము. అదే సృష్టికి పూర్వకాలము. మాయలో లీనమయిన ప్రపంచము ఆకాశమున దృశ్యమగు కాలమే 'సృష్టి' ఈ ప్రకారముగా దృశ్యమగుటనుబట్టి జగత్తును 'సాది' అని అందుము. అనగా 'మొదలు' గలది. ఇది స్థూల రూపము. మాయలో లీనమయి సూక్ష్మ రూపముగానుండు దశను బట్టి సృష్టిని/జగత్తును 'అనాది' అందుము. అనగా మొదలు లేనిది. కనుక 'సృష్టికి పూర్వము' అనగా స్థూలముగా సృష్టి కనబడుటకు పూర్వము అని అర్థము. అంతేతప్ప అసలు సృష్టి పూర్తిగా నశించి మఱల క్రొత్తగా ప్రారంభమగునని అభిప్రాయము కాదు. అట్లయినచో ప్రతిసృష్టిలోను

అందఱికి ప్రళయంతోపాటుగా మోక్షము చెప్పవలసివచ్చును. అట్లయినచో పాప పుణ్యములు, ఉపాసనలు జ్ఞానము మొదలగు వేదవిధులు వ్యర్థమగును.

**వ్యాఖ్యా-8:- అథ జగద్బ్రహ్మణోః సామానాధికరణ్యం తు బాధ ఏవ, నతు సాక్షాత్. తస్మాత్ జగతః జగద్భావబాధేన బ్రహ్మత్వ ముచ్యత ఇతి కృత్వా 'పశ్చాదహం యదేతదితి-న వ్యాహన్యతే. కథ మన్యథా 'మృద్ఘట' ఇతి వ్యవహారేపి మృద్ఘటయోః సామానాధికరణ్యం స్యాత్? ఘటాకారోపమర్దనేనైవ మృదంశైక్యావగమాదితి భావః ఇతి.**

**చాతురీ-8:-** మఱి యీ ప్రపంచమంతా బ్రహ్మమయము కదా! హరివాక్యము అదే కదా! అది ఎట్లు కుదురును? సమాధానము- 'జగత్తే బ్రహ్మము. బ్రహ్మమే జగత్తు - అనుట నేరుగా సరిపోదు. ప్రపంచము ప్రపంచమే అని భావించినంత సేపు అది బ్రహ్మముగా కనబడదు. ఈ ప్రపంచము ఆభాసమని, మిథ్య అని, భ్రాంతి అని తెలిసి కొన్నపుడు దాని అసలు స్వరూపమయిన 'బ్రహ్మత్వము' అవగతమగును. ఆ లెక్కన 'జగత్తు బ్రహ్మమగును'. అనగా 'ఈ కనబడు జగత్తు వాస్తవము కాదు బ్రహ్మమే' అని అర్థము. కనుకనే భగవంతుడు 'సృష్ట్యనంతరము కనబడు విశ్వము నేనే' అని పరమార్థ దృష్టితో తత్త్వము చెప్పెను. ఇది కాదన్నచో, 'మట్టి కుండ' అనువ్యవహారమున్ను కుదరదు. కుండను కుండగా భావించినంత సేపు 'మట్టిగా' అనిపించదు. 'కుండ' ఆకారమును లేదా 'కుండ' అను 'భావనను' నలిపి వేసినచో 'మట్టి'గా కనబడును. కనుక ప్రపంచము మీద 'ప్రపంచభావన' నలిపి వేసినచో (అనగా భ్రాంతియని భావించగలినచో) 'బ్రహ్మ' భావన కలుగును. కనుక భగవంతుడు 'ఈ ప్రపంచదశయందును నేనే' అని పలికెను.

**వ్యాఖ్యా-9:- నను ప్రళయే ప్రకృతిలీనత్వేన అసత్ప్రాయైరపి చేతనా చేతనైః బ్రహ్మణః సద్వితీయత్వం స్యాదేవ-ఇతి చేత్, మైవమ్, ప్రపంచేపి తైః స్థూలైరపి సద్వితీయత్వాభావాత్. నహి సద్వస్తు మిథ్యా వస్తుభిః సద్వితీయం భవేత్. గగనం గంధర్వనగరాదిభిః ఐంద్రజాలికైః స్థలతాం న ప్రాప్నుయాద్ధి. న చ మిథ్యాత్వే జగతో వివదితవ్యమ్. అనుపదం మూల ఏవ వక్ష్యమాణత్వాత్.**

**చాతురీ-9:-** ప్రళయకాలమున చేతనాచేతనములన్నియు ప్రకృతి (మాయ)

యందు లీనమైయున్నవి కదా ఆ లీనమయినవే ప్రళయకాలమున 'బ్రహ్మ' కు తోడుగా నుండునని ఏల చెప్పరాదు? అన్నచో అసలు 'బ్రహ్మము' సర్వదా సర్వధా అద్వితీయముగదా! సూక్ష్మ ప్రపంచమే కాదు స్థూల ప్రపంచము గూడా బ్రహ్మకుతోడు గాదు. బ్రహ్మము తప్ప మిగిలిన దంతయు మాయ మిథ్య. కనుక దానియందు లీనమయిన ప్రపంచమయినను వికసించిన ప్రపంచమయినను 'బ్రహ్మ'కు తోడుకాదు. అది ఒక్కటే సత్యము. మిగిలినది 'మిథ్య'. ఎన్ని మిథ్యలయినను 'సత్య' వస్తువునకు ఈడు-జోడు కావు గదా. ఆకాశమున మేఘ ప్రసరణ వలన అనేక ఆకారములు-కొండలు, మొసళ్ళు-తాబేళ్ళు వంటివి ఏర్పడును. అంతమాత్రమున ఈ గంధర్వనగరముల (పై ఆకారములను గంధర్వనగరములందురు) వలన ఆకాశము 'స్థలము (అనగా నేల) అగునా? అట్లే మిథ్యా దృశ్యములు ఎన్నియున్నను వానివలన సత్యమయిన 'బ్రహ్మము' నకు 'ఏకత్వము' పోదు. ద్వితీయత్వము రాదు. ప్రపంచము మిథ్య అను విషయము తరువాత శ్లోకములోనే తెల్ల మగును.

**వ్యాఖ్యా-10:- యత్తు చోదితం, కూటస్థస్యాహమితి వికారో న సంగచ్ఛత ఇతి. నైష దోషః 'అహం బ్రహ్మాస్మి' ఇతి శ్రుతివ్యాఘాతాత్. అయం భావః . దేహేంద్రియాదిమానేవ 'అహం బ్రహ్మాస్మి' ఇతి బ్రూతే. నతు కూటస్థః తస్య సాక్షిత్వాత్. న చైవ మహంపదవాచ్యస్య దేహినః కథం బ్రహ్మత్వమితి వాచ్యమ్? లక్షణయా తత్ర 'అహం' పదప్రయోగాత్ అహం పదలక్ష్యస్య కూటస్థస్య బ్రహ్మత్వం బ్రూతే దేహీ శ్రుతిర్వేతి న విరోధః. తదేవం ప్రకృతేపి శంఖ చక్రాదిమాన్ భగవానేవ స్వకూటస్థం బ్రహ్మ 'అహం' పదేన లక్షయన్ వక్తి 'అహమేవాస' మితి. అతో న దోషః. అతఏవ అహం పరమాత్మా అహమితి వ్యాఖ్యాతమ్.**

**చాతురీ-10:-** కూటస్థుడనగా అతీతుడు. సాక్షి తటస్థుడు-అట్టివాడు 'నేను' అని శరీరాభిమానమును ఎట్లు చూపెను. అని పూర్వపక్షము చేయబడినది కదా! అందుకు సమాధానము. 'నేను బ్రహ్మము' అని వేదములోనే ఉన్నది. కనుక 'నేను' అనుట తప్పుకాదు. దీని సమన్వయము ఇట్లు. దేహ, ఇంద్రియములు గలవాడే 'నేను బ్రహ్మను' అని చెప్పును. అందలి 'కూటస్థుడైన'

ఆత్మ అట్లు చెప్పదు. ఆయన అతీతమయిన 'సాక్షి' కనుక. అట్లయినచో 'అహం' అని చెప్పుకొను 'దేహి' బ్రహ్మమెట్లగును? కాదు. బ్రహ్మము మీద అహం అను పదము 'లక్షణా వృత్తిచే ప్రయోగింపబడినది. అనగా 'నేను' అనుకొనునది బ్రహ్మ ప్రతిబింబము పొందిన అంతఃకరణమే. అదే చిదాభాసుడు అని చెప్పబడును. కాగా నేను=చిదాభాసుడు=బ్రహ్మ ప్రతిబింబము, బ్రహ్మము= కూటస్థుడైన ఆత్మ కనుక 'అహం' అను పదము నేరుగా ప్రతిబింబమును చెప్పును. మాటుగా కూటస్థుడయిన 'ఆత్మను' చెప్పును. కనుక నారాయణుని వాక్యముగాని వేదవాక్యముగాని 'అహం' అను శబ్దముతో లక్షణా వృత్తితో 'బ్రహ్మము' నే చెప్పును కాని 'దేహి'ని కాదు. అట్లే ఇచ్చట శంఖచక్రాదిధరుడైన శరీరి అయిన హరి తన శరీరమునందు వ్యాపించిన 'కూటస్థుడైన' బ్రహ్మమునే 'నేను' అనుపదముతో చెప్పుచున్నాడు. కనుకనే 'అహం' అనగా 'పరమాత్మ' అని అర్థము చెప్పబడినది.

**వ్యాఖ్యా-11:- నను 'నాన్యద్యత్సదసత్పరమ్' ఇతి సూక్ష్మస్యాపి ప్రళయే సత్త్వానంగీకారః కథ మితి చేత్ ఉచ్యతే. తత్ర 'స్థూలం నామ పంచభూతాని తత్కార్యదేహాశ్చ, సూక్ష్మం నామ శబ్దాదయః' ఇతి వివక్షితత్వాత్. స్థూలే అస్మిన్ జగతి ప్రళయే ప్రకృతౌ నిలీయ సూక్ష్మరూపేణ వర్తమానే సతి జగ ద్వ్యవహారాభావాత్ బ్రహ్మణః ఏకశేషత్వోక్తిశ్చ సంగచ్ఛతే-ఇతి సర్వం దత్తోత్తరమ్.**

**చాతురీ-11:-** అయ్యా! ప్రళయమునందు స్థూలములేదన్నారు సరే! సూక్ష్మము గూడా లేదందురేమి? ప్రపంచము సూక్ష్మరూపమున పరమాత్మయందు లీనమయియుండును గదా? అని ప్రశ్న. సమాధానమేమనగా స్థూలమనగా పంచభూతములు, వానివలన ఏర్పడిన శరీరములు. సూక్ష్మమనగా శబ్దము మొదలుగునవి. స్థూలమయిన యీ ప్రపంచము ప్రళయకాలమున ప్రకృతి యందు సూక్ష్మరూపమున దాగియుండును. కనుక ప్రపంచవ్యవహారములుండవు. కనుక 'బ్రహ్మము' ఒక్కటే మిగిలినదని చెప్పవచ్చును. ఈ విధముగా పూర్వపక్షములన్నింటికి సమాధానము పూర్తి అయినది.

**వ్యాఖ్యా-12:- నను ప్రళయే మాయాయాః సత్త్వాత్ పరం నాస్తీతి కథమితి చేత్ ఉచ్యతే. మాయా హి క్రియానుమేయా నతు స్వరూపసతీ. అతః యదా**

కార్య మస్తి తదా మాయాప్యస్తీతి యదా తన్నాస్తి తదా సాపి నాస్తీతి కృత్వా కార్యస్య జగతః స్వకారణే మాయాయాం నిలీయ బీజే తరోరివ సూక్ష్మరూపేణ వర్తమానత్వేన అసత్ప్రాయత్వాత్ న తేన మాయానుమానం స్యాత్ ఇతి 'మాయా నాస్తీత్యుక్తమ్.

**చాతురీ-12:-** ప్రళయమున 'మాయ' కలదు కదా. మఱి యీ శ్లోకమున మాయ (పరము) లేదని యెట్లు చెప్పబడినది? అనిప్రశ్న. సమాధానమేమనగా, 'మాయ' అనునది ఒక స్వరూపముగల పదార్థము కాదు. క్రియలను బట్టి ఊహించుటయే. కార్యమయిన యీ ప్రపంచమును బట్టి కారణమయిన 'మాయ' కలదని ఊహించెదము. కార్యములేనిచో కారణమయిన మాయయులేదని భావింప వలయును. కనుక కార్యమయిన విశ్వము ప్రళయమున కారణమయిన మాయయందు లీనమగును. విత్తనమందున్న చెట్టువలె 'అది' సూక్ష్మరూపమున నుండుట వలన 'లేనిదానితో' సమానము. కనుక దానివలన 'మాయ ఉన్నదని' ఊహింప నవకాశములేదు. కనుక 'మాయ' లేదని చెప్పబడినది. ఆలోచనలు చేయునపుడు మనస్సుఉన్నట్లు లెక్క. (ఆలోచనలు లేనపుడు 'మనస్సు' లేనట్లు లెక్క. అట్లే విశ్వమున్నపుడు 'మాయ' ఉన్నట్లు లెక్క. విశ్వము ప్రళయమయినచో 'మాయ' లేనట్లు లెక్క.)

**వ్యాఖ్యా-13:- నను స్థూలసూక్ష్మ జగన్నిషేధేన పరమాత్మనః ఏకస్య సత్త్వే ప్రకృతశ్లోకోక్త విషయే కిం ప్రమాణ మితి చేత్ ఉచ్యతే. 'నాసదాసీ త్తదానీం నోసదాసీత్' 'స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్' ఇతి శ్రుతి రేవ. అస్తి చ దృష్టాన్తోపి సుషుప్తిః తథాహి, స్థూలనిషేధేన సూక్ష్మసత్త్వం స్వప్నే నిశ్చీయతే, తదుభయనిషేధేన స్వాత్మశేషత్వం తు సుషుప్తావితి.**

**చాతురీ-13:-** అయ్యా స్థూల, సూక్ష్మ ప్రపంచములు లయముచెందగా చివఱకు 'పరమాత్మ' ఒక్కడే మిగులును-అని ఈ శ్లోకమునకు తాము చేసిన వ్యాఖ్యకు ప్రమాణములేవి? అన్నచో ఇవి ప్రమాణములు.

1. వేదము:- ప్రలయకాలమున సృష్టికి పూర్వము సత్తు (స్థూలము) లేదు అసత్తు (సూక్ష్మము) లేదు అనియు, 'సోమ్య! మొట్టమొదట సత్యవస్తువయిన పరమాత్మ యొక్కటే కలదు' అనియు వేదవాక్యములు.

2. **దృష్టాంతము:-** సుషుప్తి=గాఢనిద్ర అనగా కలలు, కలతలు లేని 'నిద్ర' ముందు నిద్రాప్రారంభమున స్వప్నదశలో స్థూలశరీరము కనబడుటలేదు. అపుడున్నది అంతఃకరణరూపమయిన 'సూక్ష్మశరీరమేకదా'! గాఢనిద్రలో స్వప్నములు గూడా లేవు. కనుక 'అంతఃకరణము' గూడా నిద్రలో / అవిద్యలో లీనమయినది. కాగా మిగిలినది 'ఆత్మ'యే కదా. ఈ దృష్టాంతమును బట్టి ప్రళయమునందు స్థూల సూక్ష్మములు లీనమయి 'పరమాత్మ' యే మిగులును.

**వ్యాఖ్యా-14:- నను సుషుప్తౌ మాయా అస్తి వా? న వా? ఆద్యే ప్రకృతదృష్టాన్త భావానుపపత్తిః. మాయాపి నాస్తీత్యధునోక్తత్వాత్. ద్వితీయే, 'న కించిదహ మవేదిషమ్' ఇత్యుత్థితస్మృతేః అజ్ఞానానుభవజన్యాయాః అనుపపత్తిః. అజ్ఞాన మేవ మాయేతి వేదాన్త పరిభాషా. తస్మాత్ నాసౌ దృష్టాన్త ఇతి చేత్.**

**చాతురీ-14:-** అయ్యా! సుషుప్తిలో మాయ ఉన్నదా? లేదా? (1) ఉన్నదన్నచో, ఇపుడు తాము చెప్పినదృష్టాంతము కుదరదు. విశ్వము లేదా కార్యము లేనపుడు కారణమయిన మాయ లేదని తాము ఇంతకు ముందే సెలవిచ్చితిరిగదా. గాఢ నిద్రలో విశ్వము లేదు కదా. మాయయు లేదని చెప్పవలయును. కనుక 'మాయ' ఉన్నదన్నచో దృష్టాంతము కుదరదు. (2) మాయ లేదన్నచో, 'నిద్రలో నాకు ఒళ్ళు తెలియలేదు' అను స్మృతి అందఱికి సహజముగా తెలిసినదే. ఈ 'స్మృతి' కి కారణము ఆ అజ్ఞానమును అనుభవించుటయే. ఈ 'అజ్ఞానము' 'మాయ' అని 'అవిద్య' అని వేదాంతశాస్త్ర పరిభాష కదా. కనుక గాఢనిద్రలో 'మాయ' లేనిచో ఈ 'అజ్ఞానము' ఆ స్మృతి, ఎట్లు సంభవము. కనుక తమరిచ్చిన 'సుషుప్తి' దృష్టాంతముగా చెల్లదు. అనిశంక.

**వ్యాఖ్యా-15:- మైవమ్, ప్రలయేపి మాయా నిలీయ వర్తత ఏవేత్యుక్తమ్ న పునః సర్వాత్మనా నాస్తీతి. తదాత్వే ప్రకృత దృష్టాన్తానుపపత్తిః కథమ్? సౌషుప్తికతమోనుభవజన్యా ఉత్థితస్మృతిరివ ప్రళయకాలిక తమోనుభవజన్యా సృష్టి ప్రారంభే జీవానాం స్మృతి రస్తి 'నకించిదహమవేదిషం బహోః కాలా' దిత్యాకారికా. అన్యథా ప్రళయే మాయాయాః అత్యంతాసత్త్వే జీవానాం బ్రహ్మణి స్థితి కథనాత్ ముక్తి రేవ స్యాత్.**

**చాతురీ-15:-** అలాకాదు. ప్రలయమందయినను మాయ పూర్తిగా పోవునని చెప్పుటలేదు. అది నిలీనముగా నుండునని నిశ్చయము. మాయ నిలీనమై యుండును. కనుక 'సుషుప్తి' దృష్టాంతము పనికివచ్చును. నిద్రలేచినవానికి గాఢనిద్రలో 'ఒళ్లెతెలియలేదు' అను అజ్ఞానజన్యమయిన స్మృతి కలదు. అట్లే ప్రళయ కాలపు 'తమస్సు' యొక్క అనుభవము వలన జీవులకును సృష్టిప్రారంభమున 'చాలకాలముగా మనము ఘోరాంధకారములో నుంటిమి. ఏమియు తెలియలేదు' అను అనుభము కలదు. లేనిచో ప్రళయ దశలో 'మాయ' అసలు లేదన్నచో సమస్త జీవులు బ్రహ్మయందు లీనమగుదురు కనుక అందఱికి మోక్షమే అని అపార్థము సంభవించును.

**వ్యాఖ్యా-16:- తథాహి, లింగాభిమానినో జీవాః సుషుప్తౌ ప్రళయే చ కిం బ్రహ్మణి వర్తంతే? ఉత మాయాయామ్? నాద్యః పునరావృత్త్య సంభవాత్. అతః మాయాయామితి అవశిష్యతే. న చ 'బ్రహ్మణి సంపత్స్యతే' ఇతి శ్రుతి విరోధః. మాయాద్వారేతి తదర్థాత్ పర్యంకగత కశిపుశాయిన మపి పర్యంక శాయినం వదంతి హి లోకాః.**

**చాతురీ-16:-** అంతేగదా! లింగశరీరము అనగా స్వప్నములోని శరీరమును అభిమానించు జీవులు సుషుప్తి యందుగాని ప్రళయమునందు గాని బ్రహ్మలో కలియుదురా? మాయలో నుండెదరా? బ్రహ్మలో, కలియుదురన్నచో అందఱికి మోక్షమే. పునర్జన్మలుండవు. కనుక 'మాయ' లోనే జీవులుండెదరు. అయితే బ్రహ్మములో నిలిచెదరు. అను వేదవాక్యమునకు నీవు చెప్పినది విరుద్ధము కదా అందువా? విరుద్ధము కాదు. ఆ వాక్యమునకు అర్థము 'మాయద్వారానే జీవులు బ్రహ్మమునందుండెదరు' అనియే కనుక. అట్లే బ్రహ్మ లీనమయిన మాయలో లీనమయిన జీవులను 'బ్రహ్మయందున్నట్లు' వేదము చెప్పినదని గ్రహింపవలెను.

**వ్యాఖ్యా-17:- అత్రేదం తత్త్వమ్. యదా అజ్ఞానం జీవావరణ మాత్రేణ వర్తతే యథా సుషుప్తౌ, తదా తస్య బ్రహ్మణీ నిలీయ స్థితత్వేన అసత్త్వోక్తిః యదా తు ఆవరణ విక్షేపోభయరూపేణ వర్తతే యథా జాగ్రతి తదా తస్య సత్త్వోక్తిః. తస్మాత్ సుషుప్తి ప్రళయయోః, దృష్టాన్త దార్ష్టాన్తికభావ ఉచిత ఏవేతి.**

**చాతురీ-17:-** ఇచ్చట విషయమిది. సుషుప్తిలో లాగున, అజ్ఞానము జీవావరణముగా మాత్రమే ఉన్నచో అది ఆదశలో బ్రహ్మలో లీనమయియుండును కనుక దానిని 'అసత్' అన్నారు (శ్లోకములలో) జాగ్రద్దశలో వలె అజ్ఞానము జీవావరణమునే కాక విక్షేపములు (ప్రపంచ వ్యవహారములు) గూడా కలిగించును. ఆదశలో అది 'సత్తు' అని చెప్పబడెను. (శ్లోకములో) కనుక సుషుప్తి దృష్టాంతము గాను, ప్రళయము దార్ష్టాంతికము (దృష్టాంతం కావాల్సిన విషయము) గాను సరిపోవును.

**వ్యాఖ్యా-18:- నను ఏవ ముభయో రేకత్వాత్ దృష్టాన్తభావోనుపపన్న ఏవ-ఇతి చేత్ మైవమ్. తత్ర కాలస్య విశేషావహత్వాత్. తథాహి - సుషుప్తిః కతిపయ ఘటికావస్థాయినీ ప్రళయస్తు బహుయుగావస్థాయీతి భేద ఇతి భావః అనేన శ్లోకేన కశ్చిదుపదేశ స్సూచ్యతే। తథాహి, అగ్రే జాగ్రదవస్థాయాః ప్రాక్ సుషుప్తౌ అహం కూటస్థోహం-ఏక ఏవాసమ్. దేహేంద్రయాది స్థూల సూక్ష్మ నిషేధావధిత్వేన అజ్ఞానసాక్షిత్వేనచ, ప్రాజ్ఞస్య వర్తమానత్వా దితి భావః సత్. స్థూలం దేహః, అసత్ సూక్ష్మ మింద్రియాణి. పరం మనశ్చ. ఇత్యేత దన్యత్కిమపి నాస్తి. తదానీం తేషా మననుభూయమానత్వా దితి భావః.**

**చాతురీ-18:-** 'సుషుప్తి-ప్రళయము' ఈ రెండును. ఒకే రకమయినవి కనుక వీని మధ్య 'దృష్టాంత' సంబంధము ఎట్లు పొసగును? అన్నచో, వీని మధ్య తేడా కలదు. ఆ తేడా 'కాలము' సుషుప్తి కొద్దిగడియలు మాత్రమే ఉండును. ప్రళయము అనేక యుగములు నిలిచియుండునని భావము. ఈ శ్లోకము ఒక ఉపదేశమును సూచించుచున్నది. జాగ్రదవస్థకు ముందు గాఢనిద్రలో, 'నేను కూటస్థుడనని, ఒక్కడనేయని, దేహేంద్రియాదులు తానుకానని, అజ్ఞానమునకు (గాఢనిద్రకు) సాక్షినని, ప్రాజ్ఞ జీవుడు నిలిచియుండును. అని భావము. సత్ అనగా స్థూలదేహము. అసత్ అనగా సూక్ష్మమయిన ఇంద్రియాదులు. పరము అనగా మనస్సు. ఈ స్థూల సూక్ష్మ పరములు ఏవియును లేవు. అనగా గాఢనిద్రలో వాని అనుభవము లేదు కనుక లేవని లెక్క

**వ్యాఖ్యా-19:- పశ్చాత్ సుషుప్త్యనంతరమ్. జాగ్రతీతి భావః. యదేతత్ స్థూల సూక్ష్మాత్మకం తత్సర్వ మహమేవ. మయ్యేవ కల్పితత్వాత్ ఇతి భావః. యః**

అవశిష్యతే జాగ్రదనన్తరం సుషుప్తావితిభావః. స్థూల సూక్ష్మజగన్నిషేధావధిత్వేన ఇతివా. సః అహమేవ మత్కల్పిత జగన్నిషేధస్య మదవధికత్వాదితి భావః. ఇతి ఆత్మయాథాత్మ్యముపదిష్టం బ్రహ్మణే-ఇతి జ్ఞేయమ్. ఫలన్తు 'నిత్య ముక్తోహ' మితి నిశ్చయవతః పుంసః ఫలాన్తరాభావాత్ స్వరూపస్థితిరేవ ఇతి.

**చాతురీ-19:-** సుషుప్తి తర్వాత జాగ్రద్దశలో స్థూలసూక్ష్మరూపమయిన ప్రపంచ మంతయు 'నేనే' అని హరి వాక్యము. కారణము ఏమనగా తనయందే ప్రపంచమంతయు కల్పింపబడినది. జాగ్రత్తు తర్వాత సుషుప్తిలోనయినను తానే మిగులును. స్థూల సూక్ష్మరూప ప్రపంచములు సుషుప్తిలో కఱగి పోయినపుడు మిగులునది 'ఆత్మ' యే కదా! నాయందు కల్పింపబడిన జగత్తు నావఱకు వచ్చునప్పటికి ఆగిపోవును కదా! అని నారాయణుడు 'ఆత్మ' తత్త్వమును బ్రహ్మకు ఉపదేశించెను. ఈ ఉపదేశమునకు ఫలితము ఏమనగా, శ్రోతకు, తాను నిత్యముక్తుడనని నిశ్చయముకలుగుట ద్వారా-ఇతర ఫలములు కోరదగినవి లేకపోవుట వలన - స్వస్వరూపజ్ఞానము కలుగుటయే.

శ్లో॥ 'ఋతేఽర్థం యత్ప్రతీయేత
న ప్రతీయేత చాత్మని।
తద్విద్యాదాత్మనో మాయాం
యథాభాసో యథా తమః॥ **2**

**ప్రతిపదార్థము:-** యత్=ఏకారణముగా, అర్థం-ఋతే=వాస్తవ విషయము లేకుండగనే, ప్రతీయేత=ఈ జగత్తుతోచుచుండునో, ఆత్మని=ఆత్మస్వరూపము నందు, న ప్రతీయేత=తోచదో, తత్=దానినే, ఆత్మనః=పరమాత్మనయిన నా యొక్క మాయాం=మాయనుగా, విద్యాత్=ఎఱుగవలెను, ఆభాసో యథా= ఆభాసము వలె అనగా అలా కానిది అలా కనిపించటం వలె, ద్విచంద్రులు, రజ్జు సర్పములు మొదలైనవి, తమః యథా=చీకటివలె, రాహువువలె, అజ్ఞానము వలె, మాయ బ్రహ్మమునందు, సంసారమును చూపును.

**తాత్పర్యము:-** గాఢనిద్రలోని అజ్ఞానమువలె, గాఢాంధకారమువలె, నేత్ర దోషములు, భ్రాంతులు మొదలైన ఆభాసములవలె 'మాయ' బ్రహ్మమునందు ఈ ప్రపంచమును కనుపింపజేయును. లేని విషయమయినను స్వప్న

దృశ్యములవలె మాయవలన ఆత్మయందు అధ్యాసము చేయబడును. ఇదే అనిర్వచనీయమయిన మాయాస్వభావము.

**వ్యాఖ్యా-20:- నను ఆద్యన్తయోః త్వమేవ అవస్థితః మధ్యే కుతః త్వయి జగత్ప్రతీతిరితి - అతః మాయయేత్యాహ-ఋత ఇతి. యత్ యతో హేతోః అర్థమృతే వాస్తవమర్థం వినా, వస్తుత్వం వినా-ఇత్యర్థః, జగదితి శేషః. ప్రతీయేత ప్రతీయతే ఇత్యర్థః. లకారో న వివక్షితః, తత్ప్రతీతేః వర్తమానకాలికత్వాత్. ఆత్మని స్వస్వరూపే తు న ప్రతీయతే నోపలభ్యతే తదేవ ఆత్మనో మమ మాయాం విద్యాత్ జానీయాత్.**

**చాతురీ-20:-** సృష్టికి ఆద్యంతములందు నీవున్నావు గదా! స్వామీ మధ్యలో నీయందు ప్రపంచము ఏల కనబడవలెను. అను ప్రశ్నకు సమాధానము 'మాయవలన' అని. సత్యమయిన విషయములేకపోయినను మాయవలన జగత్తు ప్రతీయమానమగుచున్నది. నా ఆత్మస్వరూపమునందు మాత్రము ఇది అంటదు. (ఆకాశమునందు మేఘములు పట్టును. అంతమాత్రమున ఆకాశము నల్లనయి పోదు) కనుక మాయ పరమాత్మనయిన నాకు సంబంధించినదని మాత్రమే ఎఱుగవలయును.

**వ్యాఖ్యా-21:- అవస్తునో జగతః ప్రతీతౌ మాయైవ హేతుః. న చైవం ప్రతీతి బలాత్ అస్య వస్తుత్వమ్, పరమార్థదశాయా మప్రతీయమానత్వాత్. శ్రూయతే హి 'న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతో యమగ్నిః' భాతి=ప్రతీయతే ఇత్యర్థః జగత్ప్రతీతి జనక సూర్యాదీనామేవ ఆత్మన్యభావే కిం పునః జగత ఇతి భావః. అంధకారే జగదప్రతీతేః సూర్యాదీనాం జగద్భాసకత్వముక్తమ్. 'తత్ర కేన కం పశ్యేత్, కేన కం జిఘ్రేత్' ఇత్యాది నేతి భావః.**

**చాతురీ-21:-** ప్రపంచము అవాస్తవము అయినను కనబడుచున్నది. అందుకు కారణము మాయయే. స్వప్నములోను గారడీలోను అనేక అవాస్తవములు దర్శనమిచ్చును. అవి ఎలా 'మాయ'లో అలా ప్రపంచమున్ను మాయయే. కనబడినంత మాత్రమున అవి ఏవియును 'సత్యము' కావు. స్వప్నవస్తువులు స్వప్నములో తప్ప ఇతరత్ర కనబడవు. అట్లే సంసార దృశ్యములు సమాధిలో

పరమార్థదశలో, సుషుప్తిలో దర్శనమియ్యవు. కనుక ప్రపంచదృశ్యములు నిత్యసత్యములు కావు. కనుకనే వేద మిట్లు చెప్పుచున్నది. 'బ్రహ్మదర్శన స్థితిలో నిర్వికల్పక సమాధిలో ఈ సూర్యచంద్ర నక్షత్ర విద్యుత్, వహ్నిమయమయిన ప్రపంచము కనబడదు' అని పైన చెప్పిన సూర్యచంద్రాదులులేనిచో ఈ జగత్తే కనబడదు. మఱి ఆ సూర్యచంద్రాదులే కనబడని పరమార్థ స్థితిలో నిర్వికల్ప సమాధిలో ఇక 'జగత్తు' ఏమి కనబడును. పరమార్థ అనగా వాస్తవ స్థితిలో లేని ప్రపంచము మిథ్యయే గదా! నిత్యసత్యమయినచో ఎల్లప్పుడుండవలె గదా!

చీకటిలో జగత్తు కనబడదు కనుక సూర్యచంద్రాదులు జగత్తును కనుపింపజేయుదురని చెప్పుచున్నాము. ఈ జగత్తే లేనపుడు 'ఎవడు ఎవనిని దేనితో చూచును' కనుక జగత్తే లేదు. కేవలము మాయ వలన తోచుచున్నది.

**వ్యాఖ్యా-22:- యద్వా ఇదం జగదర్థం వినాపి యత్ ఆత్మని అధిష్ఠానభూతే బ్రహ్మణి ప్రతీయతే పరమార్థదశాయామితి శేషః. న ప్రతీయేత తదాత్మనో మాయాం విద్యాదిత్యన్వయః అనేన మాయా హేతుక జగత్కల్పనాధిష్ఠానం బ్రహ్మైవ ఇత్యుక్తమ్ నిరధిష్ఠానభ్రాంత్యయోగాదితి భావః.**

**చాతురీ-22:-** లేదా, ఎటువంటి వస్తువుగాని విషయముగాని లేకుండగా నా యందు తోచుచున్న యీ జగత్తు నా మాయయే అని తెలిసికొనుము. ఇది తోచుటకు అధిష్ఠానము బ్రహ్మమయిన నేనే. నాయందు తోచును. పరమార్థ దశలో తోచదు. కనుక మాయాజన్యమయిన జగత్తుకు అధిష్ఠానము (ఆధారము) బ్రహ్మమే. ఎటువంటి ఆధారము లేకుండగా 'భ్రాంతి' కలుగదు గదా! అంటే ఏదో ఒక వస్తువునుచూచి దానిని మఱొక వస్తువుగా భావించుట భ్రాంతి. అట్లే ఇచ్చట బ్రహ్మమును జగత్తుగా భావించుట భ్రాంతి.

**వ్యాఖ్యా-23:- నను శశశృంగాదే రవస్తునః అప్రతీయమానత్వాత్ అర్థం వినా జగత్ప్రతీయత ఇతి కథ మిత్యతో దృష్టాంతమాహ-యథాభాస ఇతి.**

**చాతురీ-23:-** ఏ వస్తువు కానిది ఎట్లు తోచును. 'కుందేటికొమ్ము' అనునది తోచునా? అట్లే ఏవస్తువు కాక, ఏ అర్థము లేక 'జగత్తు' మాత్రము ఎట్లు ప్రకాశించును? అని ప్రశ్నరాగా దానికి సమాధానము 'అభాసము' వలె అని.

**వ్యాఖ్యా-24:-** ఆభాసో ద్విచంద్రాదిః యథా ప్రతీయతే. ఏక ఏవ చంద్రః కాచకామలాద్యక్షి దోషాత్ యథాద్వేధా దృశ్యతే, తద్వదేకమేవ బ్రహ్మ మాయాదోషాత్ బహుధా దృశ్యత ఇతి భావః

**చాతురీ-24:-** ఒక్క చంద్రుడు మన కంటి దోషమువలన '2' చంద్రులుగా కనబడుట ఆభాసయే. అట్లే 'మాయ' అనే దోషము వలన లేదా మాయ యొక్క దోషము వలన ఒకే బ్రహ్మము అనేక విధములుగా కనబడుచున్నది. ఇది ఆభాసము.

**వ్యాఖ్యా-25:-** యద్వా ఏకఏవ చంద్రః జలాద్యుపాధివశాత్ బింబప్రతిబింబ భావేన ద్వేధా దృశ్యతే తద్వత్ బ్రహ్మాపి మాయోపాధివశాత్ జగద్రూపేణ బహుధా ప్రతీయత ఇతి భావః

**చాతురీ-25:-** లేదా, ఒకే చంద్రుడు నీటిలో ప్రతిబింబించుట వలన నీటిని బట్టి బింబ-ప్రతిబింబములు '2' గా కనబడుచున్నాడు. అట్లే బ్రహ్మమున్ను మాయోపాధివలన 'జగత్తు' గా అనేక విధములుగా తోచుచున్నాడు. అని ఈరకమయిన 'ఆభాస' గా చెప్పవచ్చును.

**వ్యాఖ్యా-26:-** అథవా ఆభాసో రజ్జు సర్పాదిః యథా ఇత్యర్థః. తథాచ అవిద్యాబలాత్ అవిద్యమానసర్పస్ఫురణం యథా రజ్జౌ భవతి తద్వత్ బ్రహ్మణ్యపి జగతః ప్రతీతిః మాయాబలాదితి భావః.

**చాతురీ-26:-** లేదా, ఆభాసమనగా, రజ్జుసర్పాదులవలె భ్రాంతి. రజ్జువునందు మన అవిద్యా (భ్రాంతి) బలము వలన 'సర్పము' ఎట్లుతోచునో, అట్లే బ్రహ్మము నందు మాయా బలము వలన ప్రపంచము తోచును.

**వ్యాఖ్యా-27:-** యద్వా అర్థం వినా ఆత్మని జగతః ప్రతీతౌ దృష్టాంతమాహ 'యథాభాస' ఇతి. ఆభాసమ్ స్వప్న జగత్ ఆత్మని యథా ప్రతీయతే తద్వత్-ఇత్యర్థః. అనేన దృష్టాన్తేన సరూపే చంద్రరజ్జ్వాది వస్తుని తాదృశాన్యవస్తు ప్రతీతిః స్యాన్నామ. కథం పునః నీరూపే ఆత్మని జగతః ప్రతీతిరితి శంకా ప్రత్యుక్తా, అనుభవస్య తర్కై రదూష్యత్వాదితి భావః.

**చాతురీ-27:-** లేదా, విషయము (అర్థము) లేకున్నను ఆత్మయందు జగత్తు

కనబడును. అందుకు దృష్టాంతము 'స్వప్నము' అను ఆభాసము. స్వప్న ప్రపంచము లేనిదయినను తనయందు / ఆత్మయందు ఎలాతోచుచున్నదో ప్రపంచము బ్రహ్మమునందు అలా తోచుచున్నది. దీనిని బట్టి ఏరూపములేని వస్తువు నందైనను భ్రాంతి ఏర్పడవచ్చునని తేలుచున్నది.

కనుక 'రూపముగల చంద్రుని వలన ప్రతిబింబ భ్రాంతియు, రూపముగల రజ్జువు మీద సర్పభ్రాంతియు కలుగుట సంభవమే గాని రూపములేని ఆత్మ మీద శరీరాది భ్రమ ఎట్లుకలుగును? – 'అను పూర్వపక్షమునకు సమాధానము లభించినది. స్వప్నమునందు రూపములేని ఆత్మయందే గదా అనేక దృశ్యములు అగుపడుచున్నవి. ఈ అనుభవమును 'తర్కము' తో కాదనలేము కదా!

**వ్యాఖ్యా-28:- నను ప్రతీయమానత్వేన సతోస్య జగతః కథ మప్రతీతిః? ఇత్యతో దృష్టాన్త మాహ-యథా తమ ఇతి'. తమః రాహుః యథా గ్రహణ మండలే స్థితోపి నదృశ్యతే గ్రహణేతర కాలే ఇతి భావః తద్వత్ బ్రహ్మణి స్ఫురిత మపీదం జగత్ పరమార్థ దశాయాం న ప్రతీయత ఇతి భావః.**

**చాతురీ-28:-** అయ్యా కనబడుచున్న యీ ప్రపంచమును లేదననేల? భ్రాంతి యననేల? అను ప్రశ్నకు మఱొక దృష్టాంతముతో సమాధానము చెప్పుచున్నాడు. ఆకాశమున గ్రహమండలమున ఛాయారూపుడైన రాహువు గలదు. కాని అతడు కనబడడు. గ్రహణకాలమున మాత్రము కనబడును. అదియును ఛాయా రూపముగా. అట్లే బ్రహ్మయందు మాయచే కనబడు ఈ ప్రపంచము పరమార్థ దశలో కనబడదు. తమః=రాహువు అని ఒక అర్థము.

**వ్యాఖ్యా-29:- యద్వా తమః దుఃఖమ్ సుషుప్తౌ యథా న ప్రతీయతే తద్వ దిత్యర్థః 'అంధోప్యనంధో భవతి' ఇతి శ్రుత్యా, అనుభవేన రుగ్ణోపి పుమాన్ సుషుప్తి మేత్య యథా తం రోగం తజ్జన్యం దుఃఖం చ నానుభవతి తద్వత్ జగదిదం న పరమార్థదశాయాం స్ఫురతీతి భావః**

**చాతురీ-29:-** లేదా 'తమః' అనగా దుఃఖము గాఢనిద్రలో (సుషుప్తి) తెలియదు. రోగము వచ్చినవాడు గాఢనిద్రలో తనరోగాన్ని తనకు వచ్చిన రోగ బాధను మఱచును. అట్లే పరమార్థ దశలో, సమాధిల్లో వ్యక్తి యీ జగత్తును మఱచును.

కనుక తోచదు. కనుక ఉన్నదయినను కనబడదు అనుటకు పై అనుభవము ప్రమాణము. ఇదిగాక వేదము గూడా 'గ్రుడ్డివాడయినను గ్రుడ్డిగా ఉండదు' అని చెప్పుచున్నది. ఒక నడుమంత్రపు గ్రుడ్డివాడు స్వప్నములో అన్ని దృశ్యములను చూడగలడు. అంటే వాడు గ్రుడ్డివాడు కాడు. గ్రుడ్డితనము శరీరమునకే గాని 'ఆత్మ' కు కాదు గదా! వాని అంధత్వము పోయినట్లు యోగికి పరమార్థ దశలో 'జగత్తు' పోవును.

**వ్యాఖ్యా-30:- యద్వా మాయా అర్థం వినాపి జగత్ ప్రత్యాయయతి-ఇత్యత్ర దృష్టాంతమాహ-యథా తమ ఇతి. అంధకారే హి అవిద్యమానానామపి పిశాచాదీనాం ప్రతీతి స్సంభవతీతి భావః**

**చాతురీ-30:-** లేదా అర్థము లేకపోయినను 'మాయ' జగత్తును దర్శింపజేయును. ఇందుకు మఱొక దృష్టాంతము 'చీకటి'. ఈ 'చీకటి' లేని పిశాచాదులను, ఎట్లు కనిపింపజేయునో అట్లు మాయ జగత్తును కల్పించును.

**వ్యాఖ్యా-31:- అథవా ప్రతీయమానస్యాపి వస్తునః స్వస్వరూపే న ప్రతీతిః ఇత్యతో దృష్టాన్తమాహ-యథా 'తమ' ఇతి. తమ ఇతి సప్తమ్యర్థే- ప్రథమా. అంధకారే యథా ఘటాదేః వస్తునః అప్రతీతిః తద్వత్ జగతః బ్రహ్మణీతి భావః. ఇయాంస్తు విశేషః- ప్రకాశైక స్వభావం బ్రహ్మ అప్రకాశైక స్వభావం తు తమ ఇతి.**

**చాతురీ-31:-** లేదా, ఉన్నవస్తువయినను లేదా కనబడే వస్తువయినను స్వస్వరూపమునందు అనగా పరమార్థదశలో కనబడదు. ఉదాహరణము- 'చీకటి'. కుండ కనబడేదయినను చీకటిలో కనబడదు. అట్లే జగత్తు కనబడుచున్నను 'బ్రహ్మ' స్థితిలో కనబడదు. కాకపోతే తేడా ఏమనగా, బ్రహ్మము ప్రకాశ రూపము. చీకటి ప్రకాశరహిత రూపము.

**వ్యాఖ్యా-32:- యద్వా మాయా ప్రతీయమానత్వేన సదపి జగత్ న స్వస్వరూపే ప్రత్యాయయతి-ఇత్యత్ర దృష్టాంతమాహ-యథా తమ ఇతి. తమః అజ్ఞానం సౌషుప్తికమితి భావః, సుషుప్తి రితి యావత్. యథా సుషుప్తిః సదపి జగత్ న ఆత్మని భాసయతి తద్వన్మాయాపీతి భావః.**

**చాతురీ-32:-** కనబడుచున్నది కనుక 'ఉన్నది' అని మనము భావించు ఈ ప్రపంచమును మాయ స్వస్వరూపమున / ఆత్మరూపమునందు కనబడనీయదు. ఉదా॥ గాఢనిద్రలోని అజ్ఞానము మనకు ప్రపంచమును తోచనీయదు కదా! అట్లే మాయయు సమాధిలో ఆత్మయందు ప్రపంచమును భాసింపనీయదు.

**వ్యాఖ్యా-33:- అత్రేదం తత్త్వం; బ్రహ్మణి మాయయా ప్రతీయమాన మిదం జగత్ న సత్, అవస్తుత్వాత్, ద్విచంద్రవత్, రజ్జుసర్పవత్ స్వప్న జగద్వచ్చ- ఇతి ప్రయోగః. అవస్తుత్వేతు యదీదం జగద్వాస్తవం స్యాత్ తర్హి ఆత్మన్యపి స్ఫురేత్. అతః జగదిద మవస్తు, వ్యావర్తమానత్వాత్, రజ్జుసర్పవదితి ప్రయోగః అథ జగదిదం నాప్యసత్, ప్రతీయమానత్వాత్, వ్యతిరేకదృష్టాన్తేన శశశృంగవదితి చ ప్రయోగః.**

**చాతురీ-33:-** తత్త్వ సారాంశమిది. బ్రహ్మయందు మాయగా కనబడుచున్న యీ ప్రపంచము 'సత్తు' కాదు. వాస్తవము కాదు. కనుక. '2' చంద్రులవలె (నీటిలో ప్రతిబింబించిన చంద్రునితో బాటు అసలు చంద్రుడు) త్రాటిపై భ్రాంతితో ఏర్పడిన పామువలె, కలలో కనబడు 'ప్రపంచము' వలె, (అనునది తార్కిక ప్రయోగ వాక్యము). జగత్తు సత్యమయినచో పరమాత్మయందున్ను అది కనబడవలయును. కనుక జగత్తు సత్యముకాదు. రజ్జు సర్పభ్రాంతిలో రజ్జువని తెలిసిన వెంటనే, 'సర్పము' తొలగుచున్నది. అట్లు బ్రహ్మజ్ఞానము కలిగినంతనే 'జగత్తు' తొలగు చున్నది. కనుక జగత్తు సత్యము కాదు (అని తార్కిక ప్రయోగ వాక్యము) అట్లే ఈ ప్రపంచము పూర్తిగా లేనిది కాదు. కనబడుచున్నది కనుక. లేనిదయినచో 'కుందేటికొమ్ము' వలె అసలు కనబడరాదు. (అని తార్కిక వాక్య ప్రయోగము) (అనగా జగత్తు పూర్తిగా సత్యము కాదు. సమాధిలో తొలగుచున్నది కనుక. పూర్తిగా అసత్యము కాదు. కనబడుచున్నది కనుక. సత్య (సత్) అసత్య (అసత్) ములు కానిది 'మిథ్య' లేదా అనిర్వచనీయము అందురు)

**వ్యాఖ్యా-34:- తదేవం జగదిదం మాయామయం సదసద్భ్యాం అనిర్వాచ్యత్వాత్ స్వప్నజగద్వదిత్యవసీయతే యథా కారణం తథా కార్యమపీతి న్యాయేన మాయా యథా సదసదనిర్వచనీయా తద్వదేవ తత్కార్యం జగదపీతి బోధ్యమ్.**

**చాతురీ-34:-** ఈ విధముగా జగత్తు మాయామయమయినది. దీనిని 'సత్తు' అనలేము. 'అసత్తు' అనలేము. అనిర్వచనీయము. స్వప్నములో కనబడు ప్రపంచము ఇట్టిదే కదా! 'కారణమువంటిదిగానే కార్యముండును' అను న్యాయమును బట్టి మాయ 'అనిర్వచనీయ' కనుక మాయ వలన పుట్టిన (కార్యం) జగత్తున్ను అనిర్వచనీయమే మిథ్యయే.

**వ్యాఖ్యా-35:-** **ఉక్తం హి 'న నిరూపయితుం శక్యా, విస్పష్టం భాసతే చ యా, సా మాయేతీంద్రజాలాదౌ లోకాః సంప్రతిపేదిరే' ఇతి విద్యారణ్యస్వామిభిః నిరూపయితుం సత్త్వేన అసత్త్వేన వా నిర్ణేతు మిత్యర్థః. మాయాయాః లక్షణం తు అధ్యాస హేతుత్వమ్. అధ్యాసస్తు 'అతస్మింస్తద్బుద్ధిః' ఇతి సూత్రభాష్యకారై రేవ గదితమ్. తస్మాత్ సచ్చిదానందలక్షణే బ్రహ్మణి అనృత జడదుఃఖాత్మక జగద్బుద్ధి హేతుః మాయైవేతి.**

**చాతురీ-35:-** విద్యారణ్యస్వామి పంచదశిలో ఇట్లు చెప్పిరి.

'స్పష్టముగా ప్రపంచరూపమున గోచరించును. కాని నిరూపింపశక్యము కాదు. ఇంద్రజాలము ఇట్టిదే. అట్టిదే మాయ అని అందఱు అంగీకరించిరి'. కనుక సత్తు అని గాని అసత్తు అని గాని నిర్వచనము చేయుటకు సాధ్యము కానిది 'మాయ'. ఇది 'అధ్యాస' ను కలిగించును. 'అధ్యాస' అనగా 'అదికాని దానియందు 'అదే' అను బుద్ధి పుట్టించుట. రజ్జువునందు 'సర్పము' అను బుద్ధి / భ్రాంతి కల్గించుట, అధ్యాసము. ఈ విషయము సూత్రభాష్యకారులయిన శంకరాచార్యస్వామివారే చెప్పిరి.

కనుక సత్యజ్ఞానానంద స్వరూపమయిన బ్రహ్మమునందు అసత్య - అజ్ఞాన దుఃఖ స్వరూపమయిన సంసారము అను భ్రాంతి మాయవలననే కలిగినది.

*శ్లో॥ యథా మహాన్తి భూతాని*
*భూతేషూచ్చావచేష్వను।*
*ప్రవిష్టాన్యప్రవిష్టాని*
*తథా తేషు న తేష్వహమ్॥* *3*

**ప్రతిపదార్థము:-** మహాంతి=గొప్పవయిన, భూతాని=పంచభూతములు,

ఉచ్చావచేషు=చిన్న, పెద్ద భౌతికవస్తువులందు అనగా పంచభూతములవలన ఏర్పడిన ప్రపంచ వస్తువులయందు ప్రాణులయందున్ను, యథా=ఏవిధముగా, అను ప్రవిష్టాని=ప్రవేశించినవో, అప్రవిష్టాని=ప్రవేశింపలేదో, తథా=ఆ పంచ భూతముల వలె, అహమ్=నేనున్ను, తేషు=వానియందు ప్రవేశించితిని, తేషు= వానియందు, న=ప్రవేశింపలేదు.

**తాత్పర్యము:**– పంచభూతములు అనగా భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము. ఇవి కలియకుండా తయారయిన వస్తువు లేదు. ప్రాణియు లేదు. సర్వత్ర ఈ భూతములు ఉండవలసినదే. అంత మాత్రమున ఇవి విడిగాలేవా? ఉన్నవి. అనగా పంచభూతములు సర్వపదార్థములందును ప్రవేశించినవి. ప్రవేశించకుండా మిగిలి బాహ్యముగా వ్యాపించియున్నవి. అలాగే నేనును (హరి) ఈ భూతములందు, భౌతికములందు ప్రవేశించితిని. ప్రవేశింపలేదు. అనగా అంతర్యామిగాను సర్వవ్యాపిగాను ఉన్నాను అని హరి వాక్యము.

**వ్యాఖ్యా–36:– నను బ్రహ్మణి మాయయా జగత్కల్పిత మింద్రజాలేన గగనే గంధర్వనగరవత్–ఇత్యుక్తమ్. తథాత్వే బ్రహ్మణః జగద్బహిర్వ్యాప్తే రేవావగమాత్, జగదంతర్వ్యాప్తి ప్రతిపాదక అంతర్యామి బ్రాహ్మణ శ్రుతి విరోధః, 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' ఇతి శ్రుతి విరోధః. పరిపూర్ణత్వవ్యాఘాతశ్చ. కించ 'తదైక్షత బహు స్యాం ప్రజాయేయ, తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, సచ్చ త్యచ్చాభవత్ ఇతి జగదుపాదాననిమిత్తో భయకారణత్వం బ్రహ్మణి శ్రూయమాణం న సంగచ్ఛేత, మాయాయా మేవ ప్రకృతే తత్ప్రతిపాదనాత్– ఇత్యత ఆహ–యథేతి.**

**చాతురీ–36:**– అయ్యా! ఇంద్రజాలముచేత ఆకాశములో గంధర్వనగరములవలె మాయచే బ్రహ్మమునందు ప్రపంచము కల్పింపబడినదని చెప్పినారు గదా! అటువంటప్పుడు బ్రహ్మము జగత్తుబయట మాత్రమే వ్యాపించియున్నట్లు అర్థమగుచున్నది. జగత్తు లోపల గూడా భగవంతుడు వ్యాపించియున్నాడు అను 'అంతర్యామి బ్రాహ్మణ' వేదవాక్యమునకు ఈ అర్థము విరుద్ధము కదా! అట్లే 'భగవంతుడు లోనను బయటను వ్యాపించియుండెను' అను వేదవాక్యము నకు గూడా విరుద్ధము కదా! పైగా భగవంతుని పరిపూర్ణతకు ఇది విరుద్ధము

కదా! అంతేగాక 'ఆ బ్రహ్మము తాను అనేకముగా కాదలచెను. ఆ విధముగా సృష్టిచేసి ఆ బ్రహ్మము సృష్టిలోపల ప్రవేశించెను. అదే 'సత్తు, తత్తు' అయ్యెను. అను వేదవాక్యములకు గూడా ఇది విరుద్ధము కదా! వీని ప్రకారము బ్రహ్మము జగత్తునకు ఉపాదానకారణమనియు (కుండకు మట్టి వలె) నిమిత్తకారణమనియు (కుండకు కుమ్మరి వలె) తేలుచున్నది కదా! మీరేమో ఈ మొత్తము'మాయ' కు అంటగట్టుచున్నారు. ఎట్లు ఈ దోషములు తొలగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**వ్యాఖ్యా-37:- యథా మహాన్తి భూతాని పృథివ్యాదీని పంచ, ఉచ్చావచేషు న్యూనాధికేషు భూతేషు లక్షణయా భౌతికేషు మృగనర కీటగజాదిషు ప్రాణిషు అనుప్రవిష్టాని, సృష్టే రనంతరం ప్రవిష్టానీవ, తేషు వివర ప్రాణ చక్షుః ద్రవ కాఠిన్యాది రూపేణోపలభ్యమానత్వాదితి భావః. అప్రవిష్టాని చ ప్రాగేవ కారణతయా తేషాం సత్త్వాత్ ఇతి భావః.**

**చాతురీ-37:-** భూమి మొదలగు '5' భూతములు తమనుంచి తయారయిన వస్తువులందు అనగా మృగమనుష్య కీటకాదులందు కొంచెము హెచ్చుతగ్గులుగా ప్రవేశించినవి. రంధ్రములుగా ఆకాశము, ఊపిరిగా గాలి, కన్నులుగా అగ్ని, ద్రవములుగా నీరు, గట్టిదనముగా భూమి ప్రవేశించినవి. అంతకు ముందు లాగా కారణములుగా అవి ప్రవేశించకుండానేయున్నవి.

**వ్యాఖ్యా-38:- యద్వా బహిరపి పంచభూతోపలంభాదితి భావః. తథా తేషు భూతేషు భౌతికేషు చ అహ మప్రవిష్టః తేషు న ప్రవిష్టశ్చ భవామీతి శేషః**

**చాతురీ-38:-** లేదా, బయట గూడా పంచభూతములు వ్యాపించియున్నవి గదా! ఆవిధముగానే పంచభూతములందు, భూతజన్యములయిన వస్తువు లందున్న నేను ప్రవేశించియు ప్రవేశించకనేయుంటినని హరి వాక్యము.

**వ్యాఖా-39:- అయంభావః. 'పంచభూతమయానాం దేహానాం అంతఃబహిశ్చ యథా పంచభూతాని సంతి, తథా మాయామయస్య జగతః అంతః బహిశ్చ మాయీ పరమేశ్వరోహం వర్తే. కేవల బ్రహ్మణః మాయాం వినా సంకల్పాద్య యోగాత్. 'తదైక్షత'-ఇత్యాది శ్రుతిష్వపి మాయాశబలిత మీశ్వరాఖ్యం బ్రహ్మైవ**

**తదాదిపదైః గృహ్యతే. అతో మాయాయాం జగత్కారణత్వోక్తిః న విరుధ్యతే మాయాద్వారేణైవ బ్రహ్మణః జగత్కారణత్వాత్.**

**చాతురీ-39:-** పంచభూతమయమయిన శరీరములకు లోపల, బయట గూడా పంచభూతములు గలవు. అట్లే మాయామయమయిన ఈ ప్రపంచమునకు లోపల బయట 'మాయావి' అయిన ఈశ్వరుడు కలడు. 'శుద్ధబ్రహ్మ' కు జగత్తును సృష్టింపవలయుననే సంకల్పముండదు. అట్టి సంకల్పము మాయా సహిత బ్రహ్మకే .కలుగును. 'అది సృష్టింపవలయునని కోరెను' అను వేదవాక్యములో 'అది' అనునది శుద్ధ బ్రహ్మము కాదు. మాయాశబల బ్రహ్మమే. కనుక మాయ జగత్కారణమన్న సంగతి వేద విరుద్ధము కాదు. బ్రహ్మమయినను 'మాయ' ద్వారానే 'జగత్కర్త' అగును.

**వ్యాఖ్యా-40:- తదేవం పరమేశ్వరో మాయయా భూతాని భౌతికాని చ నిర్మాయ, జీవరూపేణ కారణతారూపేణ చ తదనుప్రవిష్టః. భూతానాం భౌతికానాం చ తస్మిన్నేవ కల్పితత్వేన తేభ్యః బహిరవస్థితత్వాత్. అప్రవిష్టశ్చ భవతీతి. యదా ప్రళయదశాయాం భూతాని భౌతికేషు అప్రవిష్టాని తదా భౌతికానా మభావాత్. ప్రపంచదశాయాం తు ప్రవిష్టాని యథా, తథా అహమపి జగదుదయా త్ప్రాగప్రవిష్టః. జగదుదయే తు తత్ర ప్రవిష్టశ్చేతి.**

**చాతురీ-40:-** ఈవిధముగా పరమేశ్వరుడు మాయతో భూతములను, భౌతికములను సృజించెను. తరువాత కారణమయిన భూతములుగను, జీవుడు గను వానియందు ప్రవేశించెను. అయితే భూతములు, భౌతికములు భగవంతుని యందే కల్పింపబడినవి (మట్టియందు నామరూపములుగల కుండల వలె). కనుక వానికన్న విడిగా నిలిచియున్నాడు కనుక వానియందు జీవ, కారణ రూపములతో ప్రవేశించినట్లు లెక్క. ప్రళయదశలో భూతములు భౌతికముల యందు ప్రవేశింపక భూతములుగనేయుండును. కారణము-భౌతికములు ధ్వంస మగుటయే ప్రళయము కదా! ప్రపంచము సృజింపబడినదశలో భౌతికములు ఏర్పడును కనుక భూతములు భౌతికములో ప్రవేశించియుండును. ఉదాహరణకు కుండ ఉన్నచో ఆ కుండయందు మట్టి కారణరూపముగా ప్రవేశించియుండును. కుండ లేనిచో (ప్రళయం) మట్టి 'కుండయందు ప్రవేశించి

యుండుట' అనుమాటకు అర్థము లేదు. మట్టి మాత్రమేయుండును. అట్లే నేనును (హరి) ప్రపంచము ఏర్పడకముందు, ప్రపంచము ధ్వంసమయిన దశలోను, ప్రపంచమునందు ప్రవేశించియుండను. ప్రపంచమే లేదు కనుక. ప్రపంచము కనబడుదశలో ప్రపంచమునందు ప్రవేశించి యుండెదను. అని బ్రహ్మతో హరి వాక్యము.

**వ్యాఖ్యా-41:- నన్వేవం భూతానాం భౌతికానాం చ అంతర్బహిర్వ్యాప్తి ప్రతి పాదనేపి న పరిపూర్ణత్వం బ్రహ్మణః, భూతభౌతికాంశే తద్వ్యాప్త్యభావాత్. స్థానే హి ఘటస్య అంతః బహిః వ్యాప్య స్థితమపి గగనం న హి ఘటత్వావచ్ఛిన్నే దేశే వర్తతే. ఘటావయవైః గగనావయవానాం తిరోహితత్వాత్-ఇతి చేత్.**

**చాతురీ-41:-** అయ్యా, భూతములకు భౌతికవస్తువులకు బయట లోపల 'బ్రహ్మము' వ్యాపించినట్లు ప్రతిపాదించితివి. కాని ఆ వస్తువుల స్వరూపమయిన పాంచభౌతిక భాగములందు బ్రహ్మము వ్యాపింపలేదు గదా! ఏమనగా, కుండకు బయట, లోపల ఖాళీయందు బ్రహ్మము వ్యాపించినది. కాని 'కుండ' అను వస్తువుయొక్క 'మట్టి స్వరూపమునందు' బ్రహ్మము లేదు గదా! మట్టియే గదా ఉన్నది. అనగా కుండ గోడలలోని 'మట్టి' అంశములలో మట్టి తప్ప బ్రహ్మ ముండదు గదా! అచ్చట గల 'ఖాళీ' ని మట్టి పూరించినది గదా! ఇక అవకాశము / సందు లేనిచోట బ్రహ్మమెట్లు వ్యాపించును? అని ప్రశ్న.

**వ్యాఖ్యా-42:- మైవమ్. గగనే ఘటకారణత్వాభావేన దృష్టాన్తవైషమ్యాత్. తథాహి మృద్ధి ఘటాకారపరిణతా సతీ స్వకార్యఘటాంతర్వర్తతే. ఘటే మృదుపలంభాత్. తథా అపరిణతాసతీ బహిశ్చ వర్తతే. మృత్పిండస్య ఘటవ్యతిరేకేణ దృశ్య మానత్వాత్. ఇదమేవ హి కార్యస్య కారణానన్యత్వమ్ కారణస్యచ కార్యానన్యత్వం నామ, మృద్వ్యతిరేకేణ ఘటానుపలంభః. ఘటవ్యతిరేకేణ చ మృదుపలంభః ఇతి.**

**చాతురీ-42:-** అట్లుకాదు. ఆకాశమును దృష్టాంతముగా భావించుటవలన ఈ సందేహము వచ్చినది. ఆకాశము ఘటమునకు లోపల బయట ఉండును గాని, ఘటపు గోడలలోనుండదు. కారణము-ఘటము ఆకాశముచేత తయారు చేయబడిన వస్తువు కాదు కనుక. అందువలన ఈ ఆకాశదృష్టాంతము వలన

ఇచ్చట సందేహము వచ్చినది. 'మట్టి' కారణము. కుండ కార్యము. మట్టి కుండ ఆకారముగా పరిణమించినది. అందువలన 'మట్టి' తనకు కార్యమయిన కుండలో నుండును. కుండలో మట్టి కనబడుచున్నది కదా! అట్లే కుండగా కాని మామూలు మట్టి బయటనేయున్నది కదా! కుండ కాక విడిగా 'మట్టి' కనబడుచున్నది కదా! మట్టి గాని 'కుండ' ఉండదు. ఐనను, 'కుండ' గాని మట్టి లభించును. కార్యము (అనగా కుండ) కారణం (అనగా మట్టి) కన్న భిన్నముగా లభింపదు. అట్లే కారణము (మట్టి) కార్యము (కుండ) కన్న భిన్నముగా లభించును. అనగా కారణము అయిన పరమాత్మ సర్వత్ర లభించును. కార్యమయిన జగత్తు సర్వత్ర లభింపదు.

**వ్యాఖ్యా-43:-** **ఏవం పరమేశ్వరోపి మాయయా జగద్రూపేణ పరిణమమాన స్సన్ స్వకార్యే జగతి కారణతయా అంతః ప్రవిశ్య వర్తతే. మాయావ్యతిరేకేణ జగతః అనుపలంభాదితి భావః. అపరిణమమానశ్చ బహిర్వర్తతే. ప్రపంచం వినా బ్రహ్మణః సమాధ్యాదా వుపలభ్యమానత్వాత్-ఇతి భావః. తస్మాత్ పరమేశ్వరా నన్యత్వాత్ జగతః తదంశేపి కారణభూత పరమేశ్వర వ్యాప్తి సద్భావాత్ న పరిపూర్ణత్వ హానిరితి.**

**చాతురీ-43:-** ఇట్లే పరమేశ్వరుడున్ను మాయచే 'జగత్తుగా' పరిణమించుచు తనవలన బుట్టిన 'జగత్తు' నందు కారణరూపముతో జగత్తున ప్రవేశించును. మాయ లేకుండగనే జగత్తు లభింపదు గదా! అని భావము. జగత్తుగా పరిణమించిన 'బ్రహ్మము' జగత్తుకన్న భిన్నముగా బయట వ్యాపించియుండును. కనుకనే సమాధి మొదలగువానిలో 'జగత్తు' లేని సందర్భమున 'బ్రహ్మము' లభించుచున్నది గదా! కనుక ప్రపంచము మాయద్వారా భగవంతునియందే ఏర్పడినది కనుక కారణమయిన పరమేశ్వరుడు 'ఘట' స్వరూపమునందున వ్యాపించియే యుండును. అనగా ఘటము లోపల, ఘటస్వరూపమునందు, ఘటము బయట సర్వత్ర వ్యాపించియున్నాడు కనుక పరమేశ్వరుడు అఖండుడు, పరిపూర్ణుడు అగును. ఆయన వ్యాపించనిచోటులేదు.

**వ్యాఖ్యా-44:-** **వస్తుతస్తు పరమాత్మా వ్యవహారదశాయాం జగదనుప్రవిష్ట ఇవ భాతి. పరమార్థతస్తు నైవానుప్రవిష్టః జగత ఏవ అభావాదితి తత్త్వమ్. ఇదమేవ**

అభిప్రేత్య శ్రీధరస్వామిభిః అపి ఏతచ్ఛ్లోకస్య 'యథాభాసః' ఇత్యేతత్ స్పష్టయతీ త్యవతారికా కృతా.

**చాతురీ-44:**-అసలు వాస్తవమేమనగా, పరమాత్మ వ్యవహారదశలో ప్రపంచము నందు ప్రవేశించినట్లు తోచును. నిజమునకు అసలు ఎందులోను ఆయన ప్రవేశింపలేదు. ప్రవేశించుటకు ప్రపంచము ఎచ్చట కలదు. 'ఉన్నది' అని మనము భావించునట్టి యీ దృశ్యము 'మిథ్య'యే కదా! ఈ తత్త్వమును దృష్టి యందుంచుకొని ఈశ్లోకవ్యాఖ్యలో శ్రీధరస్వామి 'యథాభాసః' అనువాక్యము ఈ విషయమునే స్పష్టపఱచుచున్నది అని చెప్పెను.

**వ్యాఖ్యా-45:- అయమాశయః యథా, గగనగతచంద్రః జలాశయాదౌ ప్రతిబింబరూపేణ ప్రవిష్ట ఇవ దృశ్యతే, వస్తుతస్తు నైవ ప్రవిష్టః, అసంభవాత్, తద్వదేవ, ఈశ్వరోపి మాయామయే జగతి జీవరూపేణ ప్రవిష్టఇవ దృశ్యతే. చంద్రబింబ ప్రతిబింబయోః యథా జలముపాధిః తద్వత్ ఈశ్వరజీవయోః మాయైవోపాధిరితి భావః. వస్తుతస్తు నైవ ప్రవిష్టః. సచ్చిదానంద లక్షణస్య ఈశ్వరస్య దుఃఖమిశ్రాది లక్షణ జీవత్వ వ్యాఘాతాదితి భావః.**

**చాతురీ-45:**- మొత్తము అభిప్రాయమేమనగా, ఆకాశ చంద్రుడు చెఱువునందు ప్రతిబింబరూపమున ప్రవేశించినట్లు ఉండును. నిజమునకు ప్రవేశింపలేదు గదా! ప్రవేశించుట అసంభవము గదా! అట్లే ఈశ్వరుడున్ను మాయా మయమయిన యీ సంసారమునందు 'జీవరూపము' తో ప్రవేశించినట్లు కనబడును. చంద్రబింబ ప్రతిబింబములకు జలము ఉపాధి (ఆధారము) అయినట్లు ఈశ్వరజీవులకు 'మాయ' ఉపాధి అయినదని భావము. నిజమునకు ఈశ్వరుడు మాయయందు ప్రవేశింపలేదు. సచ్చిదానంద స్వరూపుడయిన ఈశ్వరునకు దుఃఖమిశ్రమయిన జీవ లక్షణము సొక్కదు కనుక ఈశ్వరుడు జీవుడు కానేరడు. మాయలోనికి ప్రవేశింపడు.

**వ్యాఖ్యా-46:- అతఏవ విదుర మైత్రేయ సంవాదే, 'భగవానేక ఏవైష సర్వక్షేత్రే ష్వవస్థితః, అముష్య దుర్భగత్వం వా క్లేశో వా కర్మభిః కుతః' ఇతి పృష్టో విదురేణ మైత్రేయ ఉత్తర మాహ-'సేయం భగవతో మాయా యన్నయేన**

విరుధ్యతే' ఇతి. అనేన అప్రవిష్టస్యాపి ఈశ్వరస్య ప్రవిష్టవదవభానం మాయయైవేతి సిద్ధమ్ ఇతి.

**చాతురీ-46:-** కనుకనే 'విదుర-మైత్రేయ' సంవాదమునందు విదురుడు ఇట్లడిగెను. మైత్రేయమహర్షీ! సర్వశరీరములందు భగవంతుడు ఒక్కడేయుండెను గదా! ఈయనకు దౌర్భాగ్యము గాని, కర్మ జన్యమయిన క్లేశములు గాని ఎట్లు కలవు? అని. అందుకు మైత్రేయుడు ఇట్లు చెప్పెను. విదురా! ఇదంతయు భగవంతుని మాయయే. 'మాయ' తర్కమునకు యుక్తికి విరుద్ధముగానుండును గదా! అని. కనుక సంసారమునందు ఈశ్వరుడు ప్రవేశింపకపోయినను ప్రవేశించినట్లు భాసించుటకు కారణము 'మాయయే'.

**వ్యాఖ్యా-47:-** నను దృష్టాంతే భూతానాం భౌతికేషు అనుప్రవేశస్య తాత్త్వికస్యైవ ప్రతిపాదనాత్ దార్ష్టాంతికేపి తదేవ యుక్తమితి చేత్. మైవమ్, దృష్టాంతేపి తదభావాత్. అతఏవ శ్రీధరస్వామిభిరపి 'ప్రవిష్టానీవ' ఇత్యుక్తమ్.

**చాతురీ-47:-** దృష్టాంతమయిన కుండయందు మట్టి మొదలగు భూతములు ప్రవేశించుట తాత్త్వికముగా చెప్పితిని. అనగా సంసారమునందున్న భగవంతుడు తత్త్వరీత్యా ఉన్నట్లు చెప్పవలయును గదా! అసలు లేదందువేమి? అని ప్రశ్న. అట్లు కాదు. దృష్టాంతమయిన ఘటమునందున్న భూతములు ప్రవేశింపలేదు. కేవలము ప్రవేశించినట్లు అనిపించును. అందువలననే 'శ్రీధరస్వామి' 'ప్రవిష్టానీవ' అని (ప్రవేశించినట్లు) వ్యాఖ్యానించెను.

**వ్యాఖ్యా-48:-** తథాహి, భూతాని భౌతికేషు సృష్ట్యనంతరం ప్రవిష్టాని వా? సృష్టేః ప్రాగ్వా? నాద్యః, భూతైరేవ భౌతికానాం సృష్టత్వాత్। నాన్త్యః తదా భౌతికానామేవాసమ్భవాత్। అతః గౌణోయ మనుప్రవేశ ఇతి అంగీకర్తవ్యమ్. కారణగుణానాం కార్యే సంక్రమణస్య న్యాయ్యత్వేన పంచభూత గుణాన్ భౌతికేషు దృష్ట్వా తేషు భూతాని ప్రవిష్టానీవ ఇత్యుత్ప్రేక్షితమ్. నతు తత్త్వమితి. అనేన గౌణ నిర్దేశేన పరమాత్మనః భూత భౌతికాను ప్రవేశప్రయుక్త తత్తద్వికార ప్రాప్తి శంకా నిరస్తా. వస్తుతః అప్రవిష్టత్వా దితి భావః, అనేన శ్లోకేన 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్' ఇతి శ్రుత్యర్థః సప్రపంచం ప్రతిపాదితః.

**చాతురీ-48:-** అంతేగదా! భూతములు భౌతిక పదార్థములయందు ప్రవేశించినవి అనిగదా చెప్పితిమి. ఇచ్చట '2' ప్రశ్నలు. (1) సృష్టికి తరువాత ప్రవేశించినవా?, (2) సృష్టికి ముందు ప్రవేశించినవా? ఇందు మొదటి ప్రశ్న కుదరదు. భూతములు భౌతికములను సృష్టించినవి కనుక తరువాత ప్రవేశించుట కుదరదు. సృష్టికి ముందే ప్రవేశించినచో 'భూతములు, భౌతికములు' అను మాటయే కుదరదు. కనుక ఈ 'ప్రవేశించుట' అనుమాట గౌణముగా ఉపయోగింపబడినది. కారణగుణములు కార్యమునందు సంక్రమించును. అట్లే పంచభూతగుణములు పాంచభౌతికము లందు సంక్రమించును. మట్టి గుణములు కుండయందు సంక్రమించును. దీనిని బట్టి పంచభూతములు భౌతికములందు ప్రవేశించినవని అనిపించును. అంతే తప్ప భూతములు భౌతికములలో ప్రవేశింపవు. అట్లే భగవంతుడును భూతములందును, భౌతికములందును ప్రవేశించుట, వాని ధర్మములు ఆయన కంటుట మొ॥ శంకలకు తావు లేదు. భగవంతుడు ప్రవేశింపడు కనుక. ప్రవేశించినట్లు మనకు అనిపించుటవలన ఈ శంకలు వచ్చును. 'జగత్తు సృజించి జగత్తునందు తానే అనుప్రవేశము చేసెను' అను వేదవాక్యమునకు ఈ శ్లోకము వివరణ చేసినది.

**వ్యాఖ్యా-49:- నను శ్రుత్యా 'అనేన జీవేన ఆత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' ఇతి శ్రుత్యంతర సంవాదాత్ ఈశ్వరస్య జీవరూపేణ జగత్యను ప్రవేశః అభిహితః. ప్రకృతశ్లోకే తు దృష్టాంతేన కారణతారూపేణ అనుప్రవేశః అభిధీయతే త్వయా తు తత్తదవసరే తదుభయమపి - ఇతి కథం సమన్వయః ఇతి చేత్ ఉచ్యతే.**

**చాతురీ-49:-** స్వామీ! వేదము ప్రకారము 'ఈ జీవరూపముతో దీని యందు ప్రవేశించి నామ రూపములను పొందెదను' అను వాక్యమును బట్టి, ఇతర శ్రుతి వాక్యములను బట్టియు ఈశ్వరుడు 'జీవ' రూపమున జగత్తునందు ప్రవేశించినట్లు తెలియుచున్నది కదా! ప్రస్తుత శ్లోకమున చెప్పిన దృష్టాంతమును బట్టి ఈశ్వరుడు జీవరూపముతో గాక 'కారణ' మయిన స్వరూపముతో ప్రవేశించినట్లు చెప్పబడినది. ఆయా సందర్భములలో నీవు '2' ను అనగా

'జీవరూపము గాను, కారణరూపము గాను ప్రవేశించినట్లు చెప్పితివి. ఈ భిన్నాభిప్రాయములకు ఎట్లు సమన్వయము కుదురును?

**వ్యాఖ్యా-50:-జీవస్య స్వస్వరూపం సచ్చిదానంద లక్షణమేవేతి న జీవేశ్వరయోః భేదః. తతశ్చ జగత్కారణం జీవోపి స్యాదేవ. అతః జీవరూపేణ అనుప్రవేశః కారణతారూపేణ అనుప్రవేశశ్చ-ఇత్యుభయమేకమేవేతి తథాహి, జగతి కారణతయా ఈశ్వరస్య అనుప్రవేశోనామ ఈశ్వరధర్మాణాం సచ్చిదానందానాం జగతి స్ఫురణమేవ. తథా జగత్ సత్, జగద్భాతి, జగత్సుఖ మితి వ్యవహారః ఏవం సచ్చిదానందస్ఫురణమేవ జగతి జీవరూపానుప్రవేశః జీవస్య తద్రూపత్వా దితి.**

**చాతురీ-50:-** జీవుడు వేఱు ఈశ్వరుడు వేఱు కాదు. ఇద్దఱును ఒక్కటే. ఇద్దఱి లక్షణము 'సచ్చిదానంద' స్వరూపమే. కనుక ఈశ్వరుడు జగత్కారణము అనగా జీవుడు జగత్కారణము అని చెప్పినట్లే. కనుక ప్రపంచమున ఈశ్వరుడు కారణరూపముగా ప్రవేశించెను. అనగా జీవుడు కారణరూపముగా ప్రవేశించెనని యర్థము. కాగా జీవుడుగా ప్రవేశించెను. అనినను, కారణముగా ప్రవేశించెను, అనినను తేడా ఏమియు లేదు చూడుము. జగత్తునందు ఈశ్వరుడు కారణ రూపముగా ప్రవేశించుట అనగా ఈశ్వర ధర్మములయిన 'సత్, చిత్, ఆనందములు' జగత్తునందు భాసించుటయే అందువలన.

జగత్తు ఉన్నది - సత్
జగత్తు తోచుచున్నది - చిత్
జగత్తు సుఖము - ఆనందము

అనువ్యవహారములు పుట్టినవి. అనగా ప్రపంచమునందలి 'ఉన్నది, తోచు చున్నది, ఆనందముగానున్నది' అనుమాటలు, వాని వెనుకగల భావనలు ఆత్మధర్మములే. ఈ '3' భావముల స్ఫురణయే ఈశ్వరుడు / జీవుడు ప్రవేశించుటకు గుర్తులు. సచ్చిదానందములే జీవ / ఈశ్వర లక్షణములు కనుక.

**వ్యాఖ్యా-51:-** నన్వేవ మీశ్వరధర్మాణాం సచ్చిదానందానామేవ కారణతయా **జగత్యనుప్రవేశే జగదనృతం, న భాతి, దుఃఖం చేతి వ్యవహారః కథమితి చేత్.**

**చాతురీ-51:-** అయితే ఈశ్వరధర్మములయిన సచ్చిదానందములు కారణ రూపముగా జగత్తునందు ప్రవేశించినచో మఱి యీ ప్రపంచమున 'అసత్యము, అజ్ఞానము దుఃఖము' ఎట్లు సంక్రమించినవి. అని ప్రశ్న.

**వ్యాఖ్యా-52:-ఈశ్వరస్య మాయిత్వేన మాయాధర్మాణామనృత జాడ్య దుఃఖానా మపి కారణతయా జగత్యన్వయాదితి.**

**చాతురీ-52:-** ఈశ్వరుడు 'మాయావి' కనుక మాయాధర్మములయిన అసత్య అజ్ఞాన, దుఃఖములు గూడా కారణముగా జగత్తునందు ప్రవేశించినవి.

**వ్యాఖ్యా-53:- అత్రేదం తత్త్వమ్ చంద్రగత లాంఛన మండల ప్రకాశాదయః జలే ప్రతిఫలితా స్సంతః 'చంద్రప్రతిబింబ' ఇతి యథా వ్యవహ్రియంతే తద్వత్ ఈశ్వరధర్మాః సచ్చిదానందాః సత్త్వమయే అన్తఃకరణే ప్రతిఫలితాస్సంతః 'జీవ' ఇత్యుచ్యంతే. ఇదమేవ ప్రతిఫలన మీశ్వరస్య జగతి జీవరూపేణ అను ప్రవేశ మాహుః. అయం చ ప్రతిబింబం విస్పష్టం భాసతే. ఉపాధేరంతఃకరణస్య సాత్త్వికత్వాత్. అస్మాదేవ 'అహం' సుఖీ 'జానామి' ఇత్యాది వ్యవహార సంభవః ప్రతిబింబస్య బింబానన్యత్వాత్ అస్య జీవస్య ఈశ్వరస్య చ న భేదః. ఇమేచ అంతఃకరణ ప్రతిఫలితా ఈశ్వర ధర్మాః దేహేపి గుణమయే ప్రతిఫలంతి. అస్మాదేవ దేహస్సన్ భాతి ఇత్యాది వ్యవహారః. నచైకత్ర ప్రతిఫలితానాం ధర్మాణా మన్యత్ర పునః ప్రతిఫలన మయుక్తమితి వాచ్యమ్. గగన సూర్యగత ప్రకాశః గృహ బహిస్స్థే ముకురే ప్రతిఫలన్నేవ తతోన్యస్మిన్ ముకురే గృహాంతస్స్థే తద్రైవ పునః ప్రతిఫలతీతి దర్శనాత్. ఇదమేవ ప్రతిఫలన మీశ్వరస్య జగతి కారణతయా అనుప్రవేశ మాహుః-ఇతి.**

**చాతురీ-53:-** సారాంశమిది. చంద్రుడు నీటిలో ప్రతిబింబించినపుడు చంద్రునిలోని 'మచ్చ వృత్తము, వెలుగు' ప్రతిబింబించును. దానిని చూచి 'చంద్రప్రతిబింబము' అందురు. అట్లే ఈశ్వర ధర్మములయిన 'సచ్చిదా నందములు' సత్త్వమయమయిన అంతఃకరణమున ప్రతిఫలించి 'జీవుడు' అని పిలువబడుచున్నవి. ఈ ప్రతిబింబమును బట్టియే ఈశ్వరుడు జీవ రూపమున జగత్తునందు ప్రవేశించెనని చెప్పుచున్నాడు. ఈ ప్రతిబింబము

స్పష్టముగా భాసించును. ఉపాధి అయిన అంతఃకరణము సాత్త్వికము కనుక అది నిర్మలమయిన అద్దము వంటిది. దీనివలన 'నేను సుఖిని, నాకు తెలుసు' వంటి వ్యవహారములు జరుగుచున్నవి. ప్రతిబింబము ఎప్పుడైనను బింబములాగానే అభిన్నముగా నుండును కనుక ఈ జీవునకు ఈశ్వరునకు భేదము ఉండదు. అంతఃకరణమున ప్రతిబింబించిన యీ సచ్చిదానంద ధర్మములు గుణమయమయిన శరీరమునందున్ను ప్రతిబింబించును అనగా ప్రసరించును. అందువలననే 'దేహము ఉన్నది, కనబడుచున్నది, సుఖముగా నున్నది' మొదలగు భావములు వ్యవహారములోనికి వచ్చినవి. ఒకసారి అంతఃకరణమున ప్రతిబింబించిన ధర్మములు మఱల శరీరమున ప్రతిబింబించుట ఎట్లు అని సందేహింపనవసరములేదు. ఆకాశమునందున్న సూర్యుడు ఇంటి బయట అద్దములోను, దాని ద్వారా ఇంటిలోని అద్దములోను ప్రతిబింబింప వచ్చును గదా! కనుక ఈరకమయిన ప్రతిబింబించుటనే 'ఈశ్వరుడు జగత్తునందు కారణరూపముగా ప్రవేశించుట' అని చెప్పెదరు.

*శ్లో॥ ఏతావదేవ జిజ్ఞాస్యం*
*తత్త్వజిజ్ఞాసునాత్మనః।*
*అన్వయ వ్యతిరేకాభ్యాం*
*యత్స్యాత్సర్వత్ర సర్వదా॥* **4**

**ప్రతిపదార్థము:-** అన్వయ=అన్వయముచేత, వ్యతిరేకాభ్యాం=వ్యతిరేకముచేత, సర్వత్ర=అన్నిచోట్ల, సర్వదా=అన్నికాలములందు, యత్=ఏది, స్యాత్=ఉండునో, ఏతావదేవ=ఇంతమాత్రమే, ఆత్మనః=ఆత్మయొక్క తత్త్వజిజ్ఞాసునా=తత్త్వము తెలియగోరువానిచేత, జిజ్ఞాస్యమ్=తెలిసికొనదగినది.

**తాత్పర్యము:-**'ఆత్మ' తత్త్వమును తెలియగోరువాడు ఎల్లపుడు సర్వత్ర విచారించ వలసినది ఇదియే. ఏ ఆత్మ వస్తువు సర్వత్ర, సర్వదా, నిలిచియుండునో దానిని అన్వయ వ్యతిరేకముతో విచారించవలయును. అన్వయవ్యతిరేకములనగా వ్యాఖ్యానమున వివరింపబడును. సంగ్రహముగా అన్వయము అనగా, ఏది ఉన్నచో ఏది తప్పక ఉండునని తేలునో అది అన్వయము. ఏది లేనిచో ఏది లేదో అది వ్యతిరేకము. వివరణమునకు వ్యాఖ్య చూడుము.

**వ్యాఖ్యా-54:-** ఏవం సంక్షేపతః శ్లోకత్రయేణ భాగవతతత్త్వమభిధాయ తదుక్తం సర్వమపి సంగృహ్యా పునరతిసంక్షేపేణాహ - ఏతావదితి. ఆత్మనః పరమాత్మనః తత్త్వజిజ్ఞాసునా తత్త్వం జ్ఞాతుమిచ్ఛునా పుంసా, ఆత్మతత్త్వజ్ఞానేచ్ఛునేత్యర్థః ఏతావదేవ జిజ్ఞాస్యం విచార్యం తదేవ జిజ్ఞాస్య మాహ-అన్వయేతి. సర్వత్ర సర్వదేశేషు సర్వవస్తుషు చ సర్వదా సర్వకాలేషు కాలత్రయేపి ఇత్యర్థః.

**చాతురీ-54:-** ఈవిధముగా '3' శ్లోకములతో భగవత్తత్త్వమును చెప్పి ఈ మొత్తము విషయమును సంగ్రహించి యీ శ్లోకమున చెప్పుచున్నాడు. ఆత్మతత్త్వమును తెలియగోరువాడు విచారించవలసిన విషయము ఇంత మాత్రమే. సర్వకాలములందు సర్వదేశములయందు నిలిచిన ఆత్మస్వరూపమును చింత చేయవలయును.

**వ్యాఖ్యా-55:-** అన్వయవ్యతిరేకాభ్యాం యదేవ స్యాత్ తదేవ ఆత్మస్వరూపం జిజ్ఞాస్య మిత్యన్వయః. 'అన్వయః కార్యేషు కారణత్వేనానువృత్తిః యథా ఘటేషు మృత్ మృత్త్వేనానువర్తతే. తద్వత్ దేహేంద్రియాదిషు సత్త్వాదిరూపేణ ఆత్మాను వర్తతే, తత్సాక్షిత్వాదితి భావః.

**చాతురీ-55:-** కార్యములందు కారణము కారణముగా అనువర్తించుట- అన్వయము. ఉదాహరణ; కుండలయందు మట్టి మట్టిగా అనువర్తించును. అట్లే దేహేంద్రియాదులందు 'ఆత్మ' 'సత్, చిత్, ఆనందా' ది రూపములతో అనువర్తించియున్నది. కనుక ఆత్మస్వరూపమును ఇట్లు 'అన్వయము' గా తెలిసికొనవలయును.

**వ్యాఖ్యా-56:-** వ్యతిరేకస్తు కారణావస్థాయాం కార్యేభ్యః వ్యావృత్తిః. యథా మృత్ ఘటాత్ భిద్యతే, ఘటాత్ప్రాగపి ఘటం వినా స్థితత్వాత్.తథా దేహేంద్రియా దిభ్య ఆత్మా భిద్యతే. తేభ్యః ప్రాగపి దేహాదీన్ వినా ఆత్మనః సత్త్వాత్ - ఇతి. యథా చ బాల్యాదిభ్యః దేహీ భిద్యతే బాల్యాద్యవస్థాసు వ్యావర్తమానాస్వపి దేహినః అనువర్తమానత్వాత్. తథా జాగ్రదాద్యవస్థాభ్యః సాక్షీ భిద్యతే. జాగ్రదాదిషు మిథో వ్యావర్తమానాస్వపి సాక్షిణోనువర్తమానత్వాదితి.

**చాతురీ-56:-** వ్యతిరేకమనగా 'కారణదశలో కార్యములు నిలువకపోవుట'

ఉదాహరణ; 'మట్టి' దశలో 'కుండ' అనేదశ ఉండదు కదా! కనుక 'మట్టి' కన్న కుండ భిన్నమయినది. మట్టి ఉన్నచోటల్లా కుండ యుండదు. కుండ లేనిదశలోను కుండకు పూర్వమున్ను 'మట్టి' గలదు. అట్లే దేహేంద్రియాదులకన్న 'ఆత్మ' భిన్నముగానుండును. ఎందుకనగా, ఇవిలేకముందున్ను ఇవినశించినను, 'ఆత్మ' కలదు కదా! బాల్యాది దశలు శరీరమునందు ప్రవర్తించును. శరీరము మారు చుండును. కాని 'ఆత్మ' మారదు. 'ఆత్మ' అదే, అన్నిదశలలోను అనువర్తించును. అట్లే జాగ్రత్, స్వప్నము, సుషుప్తి - అను దశలు వేఱు. సాక్షిఅయిన ఆత్మ వేఱు. జాగ్రత్ మొదలగు దశలు మారుచున్నను 'సాక్షి' అయిన 'ఆత్మ' మాఱదు గదా!

**వ్యాఖ్యా-57:- యద్వా వ్యతిరేకోనామ, సమాధ్యాదౌ జాగ్రదాద్యవస్థానా మభావేన జాగ్రదాదిభ్యః ఆత్మనో భేదః, తతశ్చ జాగ్రదాదిభ్యః సాక్షీ భిద్యతే. సమాధ్యాదౌ జాగ్రదాదీనామభావేపి ఆత్మనః సత్త్వాదితి ప్రయోగః.**

**చాతురీ-57:-** లేదా 'వ్యతిరేకము' అనగా ఇది. సమాధి, మొదలగు వానిలో 'జాగ్రత్' మొదలగు దశలు లేవు. అయినను 'ఆత్మ' మాత్రము ఈ అన్ని దశలందు అనువర్తించును. కాగా జాగ్రదాది దశలు వేఱు సాక్షివేఱు అని తేలుచున్నది. ఏమనగా సమాధిలో జాగ్రదాది దశలు లేకపోయినను 'ఆత్మ' ఉన్నది కనుక 'ఆత్మ' వేఱు అని ప్రయోగము.

**వ్యాఖ్యా-58:- అథవా అన్వయః బ్రహ్మణః, వ్యతిరేకస్తు జగతః. తథా చ 'బ్రహ్మ సత్, భూతభౌతికేషు అనువర్తమానత్వాత్ రజ్జువత్' 'జగదసత్, వ్యావర్తమాన త్వాత్ సర్పవత్' ఇతి ప్రయోగౌ. సర్వత్ర సర్వదా చ జగతో వ్యతిరేకేణ స్వస్య అన్వయేనచ యత్ స్యాత్ తద్బ్రహ్మ జిజ్ఞాస్య మితి ఫలితార్థః**

**చాతురీ-58:-** లేదా, అన్వయము బ్రహ్మతోను, వ్యతిరేకము జగత్తుతోను చూడవలయును. కాగా, 'బ్రహ్మ సత్యము, భూత భౌతికములందు అనువర్తించు చున్నది. రజ్జువువలె' - ఇది అన్వయము. 'రజ్జువు' ఏవిధముగా త్రికాలముల యందు సత్యమో అట్లే బ్రహ్మము సత్యము. అలానే, ప్రపంచము అసత్యము 'సర్పము' వలె తొలగిపోవుచున్నది. అనగా రజ్జుసర్పభ్రాంతిలో రజ్జువు సత్యము

సర్పము అసత్యము, 'రజ్జువు' అని తెలియగనే 'సర్పము' అను బుద్ధితొలగి పోవును. అట్లే 'బ్రహ్మము' అని తెలియగనే 'ప్రపంచము' 'మిథ్య' అని స్పష్ట మగును. కాబట్టి సర్వత్ర సర్వదా జగత్తు లేకపోవుటవలన, బ్రహ్మము నిలుచుట వలన మిగులునది బ్రహ్మమే. దానిని తెలిసికొనవలయును.

**వ్యాఖ్యా-59:- యద్వా, యత్సత్త్వే యత్సత్త్వం - అన్వయః. యదభావే యదభావః - వ్యతిరేకః. యథా మృత్సత్త్వే ఘటసత్త్వం మృదభావే ఘటాభావః తథా ద్రష్టుః ఆత్మనః సత్త్వే దృశ్యస్య జగత స్సత్త్వమ్. ఆత్మాభావే జగదభావః**

**చాతురీ-59:-** లేదా 'ఏది ఉన్నచో ఏది ఉండునో-అది అన్వయము'. ఏది లేనిచో ఏది లేదో - అది వ్యతిరేకము. ఆ లెక్కన మట్టి ఉన్నచో కుండ ఉండును. అట్లే సాక్షిఅయిన ఆత్మ ఉన్నచో దృశ్యమయిన ప్రపంచము ఉండును. ఆత్మలేనిచో ప్రపంచమున్ను లేదు. కనుక 'ఆత్మ' సత్యము నిత్యము. జగత్తు అసత్యము అశాశ్వతము.

**వ్యాఖ్యా-60:- నచ కథం కాలత్రయేపి సత ఆత్మనః కథ్యతే అభావ ఇతి వాచ్యమ్ 'యది శేషో భవేద్వక్తా' ఇతివత్ ఆత్మాభావస్య సంభావనా మాత్ర పరత్వాత్. నన్వేవం యది ఆత్మా న స్యాత్ తర్హి జగత్ నస్యాదితి సిద్ధత్వేన ఆత్మాభావో యథా అసంభావితః తద్వదేవ జగదభావోపీతి కృత్వా ఆత్మవత్ జగదపి సత్యమేవ స్యాత్-ఇతి చేత్.**

**చాతురీ-60:-** అయ్యా 'ఆత్మలేనిచో ప్రపంచమున్ను లేదు' అని అన్నారు కదా! నిత్యముగా '3' కాలములయందును ఉండు 'ఆత్మ' లేకపోవుటయెట్లు? అని ప్రశ్న. సమాధానమేమనగా, ఇది ఊహామాత్రవాక్యము. ఆదిశేషుడు వర్ణించినచో నీగుణములు మొత్తము వర్ణింపగలడు, అట్లే నాకు ఱెక్కలున్నచో ఆ విమానమును పట్టుకొనగలను ఇట్టివి ఊహావాక్యములు. కనుక 'ఆత్మ లేకపోవుట' అను వాక్యము ఊహగా చెప్పినదే గాని సంభవము కాదు. అట్లయినచో 'ఆత్మలేనిచో జగత్తు లేదు' అను వాక్యమున 'ఆత్మ' లేకపోవుట అసంభవమని తేలినది గదా! అట్లే ఆ వాక్యములోని '2'వ విషయమయిన 'జగత్తులేదు' అనుమాట గూడా అసంభవము కావలెను గదా! అపుడు ఆత్మవలె జగత్తున్ను సత్యమే అని తేలును గదా అని ప్రశ్న.

**వ్యాఖ్యా-61:-** మైవమ్, మృత్సత్త్వే ఘట సత్త్వమితి అన్వయజ్ఞానస్య యత్ర యత్ర ఘటః తత్ర తత్ర మృత్' ఇతి అన్వయ వ్యాప్తిః కారణం భవతి. తతశ్చ ఘటస్య వ్యాప్యత్వం, మృదస్తు వ్యాపకత్వం లభ్యతే, తేన ఘటాభావవద్వృత్తిత్వం మృదః సంభవతీతి కృత్వా మృత్సత్త్వేపి ఘటాభావః స్యాదేవ. అన్యథా మృదః వ్యాపకత్వాభావేన మృత్సత్త్వే ఘటసత్త్వమితి, అన్వయస్యైవ అసంభవాత్.

**చాతురీ-61:-** అలాకాదు. 'మట్టియున్న చోట కుండ ఉండును' అను అన్వయ (సంబంధ) జ్ఞానమునకు 'కుండ ఉన్నచోటల్లా మట్టియుండుట' అను వ్యాప్తి కారణము అగును. అందువలన ఘటము వ్యాప్యము (=తక్కువ వ్యాప్తిగలది) మట్టి వ్యాపకము (ఎక్కువవ్యాప్తి గలది) అగును. కనుక ఘటము లేనిచోట గూడా మట్టి యుండును. ఎక్కువ వ్యాప్తి కలది కనుక. మట్టియున్నను 'కుండ' యండదు. 'కుండ' తక్కువ వ్యాప్తి కలది కనుక. లేనిచో మట్టి వ్యాపకము కానిచో (ఎక్కువ వ్యాప్తి కలది) మట్టి ఉన్నచో ఘటముండును అను అన్వయ వ్యాప్తికే అవకాశము ఉండదు.

**వ్యాఖ్యా-62:-** తథా ప్రకృతేపి ఆత్మసత్త్వే జగత్సత్త్వమితి అన్వయస్య 'యత్ర యత్ర జగత్ తత్ర తత్ర ఆత్మా' ఇతి వ్యాప్తి జ్ఞానస్య కారణత్వేన జగదభావ వద్వృత్తిత్వ మాత్మనః సంభవతీతికృత్వా ఆత్మవత్ జగతః సత్యత్వం నైవ స్యాదితి. (జగదభావవద్ వృత్తిత్వం జగదభావవతీషు సమాధి సుషుప్త్యాదిషు దశాసు వృత్తిః వర్తనం యస్య తత్త్వమిత్యర్థః.)

**చాతురీ-62:-** అట్లే ప్రస్తుతము 'ఆత్మ ఉన్నచో జగత్తు కలదు' అను 'అన్వయము' వలన, 'జగత్తున్న చోటల్లా ఆత్మ గలదని' వ్యాప్తి జ్ఞానము వచ్చినది. దీనివలన ఆత్మ జగత్తులేనిచోటను గలదని తేలును. కనుక ఆత్మ వలె జగత్తు సత్యము కానేరదు. జగత్తులేనిచోట్ల అనగా సమాధి సుషుప్తి మూర్ఛ మొదలగునవి. ఈ దశలందు జగత్తు లేకపోయినను 'ఆత్మ' ఉండును.

**వ్యాఖ్యా-63:** వస్తుతస్తు దర్శితరీత్యా అన్వయవ్యాప్తి సంభవేన అన్వయసంభవేపి వ్యతిరేకో నైవ సంభవతి. వ్యతిరేకవ్యాప్త్యభావాత్. తథాహి, యత్ర యత్ర వహ్న్యభావః తత్ర తత్ర ధూమాభావ ఇతి హి వ్యతిరేకవ్యాప్తిః ధూమాభావవ

**దయోగోళకే వహ్న్యభావస్య సత్త్వేన ధూమాభావస్య వ్యాపకత్వాత్ వహ్న్యభావస్య చ వ్యాప్యత్వాత్. (అధికవృత్తిత్వం వ్యాపకత్వం అల్పవృత్తిత్వం తు వ్యాప్యత్వ మితి జ్ఞేయమ్)**

**చాతురీ-63:-** పైన చెప్పిన ప్రకారము అన్వయ వ్యాప్తి కుదిరినను 'వ్యతిరేకము' కుదురుట లేదు. వ్యతిరేక వ్యాప్తి లేదు కనుక. 'అగ్నిలేనిచోటల్లా ధూమము లేదు, అన్నది వ్యతిరేకవ్యాప్తి, ధూమములేని, రాతిగుండు' నందు నిప్పు గూడా లేదు కనుక ధూమాభావము వ్యాపకము 'అగ్ని-అభావము' వ్యాప్యము. (వ్యాపకము అనగా ఎక్కువచోట ఉండునది. వ్యాప్యమనగా తక్కువచోట నుండునది.)

**వ్యాఖ్యా-64:- తథా ప్రకృతే యత్ర యత్ర ఆత్మాభావః తత్ర తత్ర జగదభావః ఇతి వ్యాప్తిః సంభావ్యేత. కథ మన్యథా ఆత్మాభావే జగదభావ ఇతి వ్యతిరేక ఉదీయాత్. ఇయం హి వ్యాప్తిః న స్వప్నేపి సంభావయితుం శక్యా. ఆత్మాభావ వద్వస్త్వభావాత్. దృష్టాంతే తు అగ్న్యభావ వద్వస్తు హ్రదాదిక మస్తీతి జ్ఞేయమ్.**

**చాతురీ-64:-** ఆలా, ప్రస్తుతమున 'ఆత్మలేనిచోటనల్లా జగత్తులేదు' అను వ్యాప్తిని ఊహింపవలయును. లేనిచో 'ఆత్మలేనిచో జగత్తులేదు' అను వ్యతిరేకము కుదరదు. కాని యిట్టివ్యాప్తి కలలో నైనను సాధ్యము కాదు. 'ఆత్మ' లేని వస్తువు లేదు. ఆత్మ సర్వవ్యాపి, నిత్యము. దృష్టాంతమునందు 'అగ్ని' లేని వస్తువయిన 'చెఱువు' కలదు. కాని వేదాంతమున 'ఆత్మ' లేనిచోటు లేదు. అది సర్వవ్యాపి.

**వ్యాఖ్యా-65:- అతఏవ ప్రమేయత్వాభిధేయత్వాదీనాం 'కేవలాన్వయిత్వ' ముక్తం న్యాయశాస్త్రే. సర్వవ్యాపి ప్రమేయత్వేన తదభావస్య అసత్త్వాత్. తద్వత్ ప్రకృతేపి ఆత్మాభావస్య అసత్త్వాత్ నాత్ర వ్యతిరేకః శక్యతే వక్తుమ్. ఇతి తస్మాదత్ర ప్రకారాంతరేణ వ్యతిరేకః కల్ప్యః. తథాహి, ఆత్మా జగతో భిద్యతే సచ్చిదానంద రూపత్వాత్. జగతో యత్ న భిద్యతే న తత్ సచ్చిదానన్దమ్ యథా ఛాయా ఇతి వ్యతిరేకానుమానమ్. జగద్భేదాభావే సచ్చిదానందరూపత్వాభావ ఇతి వ్యతిరేకః. వ్యాప్తిజ్ఞానం తు యత్ర యత్ర జగద్భేదాభావః తత్ర సచ్చిదానందరూప త్వాభావః ఇతి.**

**చాతురీ-65:-** కనుకనే 'ప్రమేయత్వమునకు అభిధేయత్వమునకు న్యాయ (తర్క) శాస్త్రమున కేవలాన్వయిత్వము అనగా 'అన్వయము' మాత్రమే గలదని చెప్పబడినది. 'ప్రమేయత్వము సర్వవ్యాపి' కనుక అదిలేని చోటుండదు కనుక 'వ్యతిరేక వ్యాప్తి' కుదరదు. అనగా కుండలేని చోటుండ వచ్చును. కాని ప్రమేయము లేనిచోటు ఉండదు. ఏ పదార్థమయినను 'ప్రమేయము' అనగా ప్రమా=జ్ఞానమునకు, గురిఅగును. అనగా తెలియదగినదే. ఏ పదార్థమయినను అభిధేయము అనగా 'చెప్పదగినదే' అయియుండును. ఒక పదముచేత చెప్పరాని దేమియులేదు. కనుక అన్నియు ప్రమేయములే. అన్నియు అభిధేయములే. కనుక ఇవి లేనిచోట్లు లేవు. కనుక వీని విషయములో 'అన్వయము' తప్ప వ్యతిరేకము ఉండదు. అట్లే ప్రస్తుతము. 'ఆత్మ' లేనిచోటు లేదు కనుక ఇచ్చట గూడ వ్యతిరేకము చెప్పలేము. అయితే మఱొకరకముగా 'వ్యతిరేకము' కల్పింపవచ్చును.

'ఆత్మ జగత్తు కన్న భిన్నము - సచ్చిదానంద రూపము కనుక'

'జగత్తు కన్న భిన్నము కానిది ఏదియును సచ్చిదానందము కాదు' మాయవలె. ఇట్లు వ్యతిరేకానుమానమును సాధింపవచ్చును. 'జగత్తుతో భేదము లేనిచోట సచ్చిదానందరూపత్వము గూడా లేదు' అని వ్యతిరేకము. ఇచ్చట వ్యాప్తియెట్లనగా, 'జగద్భేదము లేనిచోటనల్లా సచ్చిదానందరూపత్వము లేదు' అని.

**వ్యాఖ్యా-66:- తదేవం ఆత్మనః జగదభావవద్వృత్తిత్వ ప్రతిపాదకేన అన్వయేన జగద్భేదప్రతిపాదకేన వ్యతిరేకేణ చ సర్వత్ర సర్వదా సచ్చిదానందరూపం య ద్వస్తు స్యాత్ తదేవ జిజ్ఞాస్యమితి సిద్ధమ్.**

**చాతురీ-66:-** ఇట్లు జగదభావముగల సమాధి మొదలగువాని యందు 'ఆత్మ' గలదను అన్వయముచేత, జగత్తుకు ఆత్మకుగల భేదమును ప్రతిపాదించు వ్యతిరేకముచేత ఏమితేలుననగా సచ్చిదానందరూపమయిన వస్తువు సర్వవ్యాప్త మని, శాశ్వతమని, దానినే తెలిసికొనవలయునని తేలినది.

**వ్యాఖ్యా-67:- అధవా కార్యానుస్యూతత్వ మన్వయః. కార్యభిన్నత్వం వ్యతిరేకః యథా తంతుః పటరూపకార్యానుస్యూతోపి పటాత్ భిన్నః తథా ఆత్మాపి**

**జగదనుస్యూతః జగద్భిన్నః ఇతి. తతశ్చ సర్వత్ర దేహాదిషు అన్వయేన సర్వదాపి సర్వేభ్యోపి వ్యతిరేకేణ చ యత్సత్ తత్ జిజ్ఞాస్య మిత్యర్థః. సర్వత్ర ఇత్యనేన తంత్వాది జిజ్ఞాసా నిరస్తా. (తంతుః హి పటే ఏవ అనుస్యూతః నతు ఘటాదా వితి భావః)**

**చాతురీ-67:-** లేదా, కార్యమునందు వ్యాపించియుండుట అన్వయము. కార్యమునకు భిన్నముగానుండుట వ్యతిరేకము. అని అన్వయ వ్యతిరేకములను చర్చింపవచ్చును. అట్టిచో, దారము లేదా నూలు 'వస్త్రము' అను కార్యమునందు వ్యాపించియున్నను, వస్త్రముకన్న భిన్నమయినదే. అట్లే 'ఆత్మ' జగత్తునందు వ్యాపించియున్నను జగత్తు కన్న భిన్నమయినదే. అలా సర్వత్ర దేహాదులందు వ్యాపించియు, సర్వదా వానికన్న భిన్నముగానున్న ఆ 'సత్య' వస్తువయిన 'ఆత్మ'యే తెలిసికొనదగినది. అని అర్థము. 'సర్వత్ర' వ్యాపించినది అనుటవలన దారములు మొదలగువాని జిజ్ఞాస అవసరము లేదు. దారములు వస్త్రమునందు తప్ప మఱో వస్తువునందు వ్యాపించియుండలేదు గదా! 'ఆత్మ' సర్వత్ర వ్యాపించినది. సర్వదా లభించునది గదా! కనుక అదే జ్ఞేయము.

**వ్యాఖ్యా-68:- సర్వత్రాప్యన్వయో మాయాయా అప్యస్తీతి మాయాజిజ్ఞాసా నిరాసాయ సర్వేభ్యోపి వ్యతిరేకేణ - ఇత్యుక్తమ్. అసంగస్య కేవలస్య ఆత్మనః అనుస్యూతత్వవ్యతిరిక్తత్వే కాల్పనికే ఏవేతి ద్యోతయితుం 'సర్వదే' త్యుక్తమ్. తంత్వాదేః కారణస్య కార్యావస్థాయాం పట వ్యతిరేకాసంభవేన బ్రహ్మణోపి కథం సృష్టిసమయే జగద్వ్యతిరేక ఇతి శంకా చానేన పరాస్తా. సృష్టే రతాత్త్వికత్వా దితి భావః.**

**చాతురీ-68:-** మాయ గూడా సర్వత్ర వ్యాపించును. కనుక భగవంతునితో సమానముగా దానిని స్వీకరింపరాదు. అందుకనియే అన్నింటికన్న భిన్నముగా అని చెప్పబడినది. ఆత్మ సంగరహితమయినది. కేవలమయినది. 'సర్వవ్యాప్తత, జగద్భిన్నత' అనునవి దానియందు కల్పితములే కాని వాస్తవములు కావు. అందుకే 'సర్వదా' ఎల్లపుడు అని చెప్పబడినది. నూలు మొదలగునవి కారణములు. కార్యదశలో అవి వస్త్రముకన్న భిన్నముగా కనబడవు. అట్లే బ్రహ్మ సృష్టిలో వ్యాపించినపుడు జగత్తుకన్న భిన్నముగానెట్లు తోచును? అను

ప్రశ్నకున్ను తావులేదు. పైన చెప్పినట్లు సృష్టి, సృష్టిలో వ్యాపించియుండుట మొదలగు అన్నియును కల్పితములు. కనుక, మాయ కనుక. 'బ్రహ్మము' సర్వత్ర సర్వదా లభించును.

**వ్యాఖ్యా-69:-** **యద్వా, సర్వదాపి తదేవ జిజ్ఞాస్యమిత్యన్వయః. తేన చ 'ఆసుప్తేః అమృతేః కాలం నయే ద్వేదాంతచింతయా' ఇతి స్మృతిః 'ఆత్మా వారే ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః' ఇతి శ్రుతిశ్చ అనుక్రియేతే. ఏతావతా ముక్త్యుపాయభూతాత్మజ్ఞానసాధనమన్వయవ్యతిరేకావేవ ఇతి ఫలితమ్. అన్వయ వ్యతిరేక రూపసాధనేనైవ ఆత్మనః జిజ్ఞాస్యతయా ప్రతిపాది తత్వాత్.**

**చాతురీ-69:-** లేదా, ఎల్లపుడు ఆత్మయే తెలిసికొనదగినది అని అన్వయము. 'నిద్రించుదాక, మరణించుదాక వేదాంత చింతనతోనే కాలము గడుప వలయును' అను స్మృతి, 'ఆత్మయే దర్శింపదగినది, వినదగినది, మననము చేయదగినది, ధ్యానము చేయదగినది' అను వేదమున్ను ఈ శ్లోకముచే అనుసరింపబడుచున్నవి. కనుక మోక్షమునకు ఉపాయమయిన ఆత్మజ్ఞానమునకు ఈ 'అన్వయ వ్యతిరేకములే' సాధనము. అని తేలినది. ఈ సాధనములచేతనే ఆత్మను గూర్చి విచారింపవలయునని భగవంతుని ప్రతిపాదన.

## శ్లోకచతుష్టయస్యాయం సారాంశః

**వ్యాఖ్యా-70:-** **కార్య మిదం జగత్ కేనచిత్ కారణేన అనుస్యూతం భవితు మర్హతి. తంతునా పటవత్-ఇతి ఈశ్వర మను మాయ కారణం బ్రహ్మ కార్యాత్ జగతః భిద్యతే కారణత్వాత్ పటాత్ భిన్న తంతువత్ ఇతి ఈశ్వరస్య జగద్విలక్షణత్వం చ అనుమాయ ఈశ్వర స్సచ్చిదా నంద రూపో భవితు మర్హతి. అనృత జడదుఃఖాత్మక జగద్విలక్షణత్వాత్ వ్యతిరేక దృష్టాంతేన మాయావత్ - ఇతి.**

**చాతురీ-70:-** ఈ ప్రపంచము ఒక కార్యము. ప్రతి కార్యమునందును కారణము అనువర్తించి యుండును. అనగా వ్యాపించియుండును. వస్త్రముతో దారము వ్యాపించియుండును గదా! ఈవిధముగా ఈశ్వరుడు జగత్తుకన్న విలక్షణమయిన వాడని, జగత్తునందు కారణరూపముగా వ్యాపించియున్నాడని ఊహింప

వలయును. 'ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, జగత్తుకన్న విలక్షణమయిన వాడు. జగత్తు అసత్య అజ్ఞానదుఃఖ స్వరూపముగదా! మాయవలె, అని ఊహింప వలయును.

**వ్యాఖ్యా-71:- యద్వా ఈశ్వరః సచ్చిదానందరూపో భవితు మర్హతి, తత్కార్యే జగతి సచ్చిదానందానాం స్ఫురణాత్, పటే తంతుశౌక్ల్యాది స్ఫురణవదితి. ఈశ్వరస్య సచ్చిదానందరూపత్వం చ అనుమాయ 'సర్వమిదం బ్రహ్మైవ, బ్రహ్మకార్యత్వాత్ మృదనన్యో యథా ఘట ఇతి, జగతో బ్రహ్మాత్మకత్వం చాను మాయ, బ్రహ్మణి ప్రతీయమాన మిదం జగత్ న వస్తు అద్వితీయాత్మజ్ఞానేన బాధ్యమానత్వాత్, యథా ఆత్మని ప్రతీతం ప్రబోధేన బాధ్యమానం చ స్వప్నజగత్ ఇతి జగతో మిథ్యాత్మకత్వం చానుమాయ నాహం దేహేంద్రియాది జగద్రూపః తద్విలయోదయసాక్షిత్వా దీశ్వరవత్'.**

**చాతురీ-71:-** లేదా, ఈశ్వరుడు సచ్చిదానందస్వరూపుడు. ఈశ్వర కార్య మయిన జగత్తునందు సచ్చిదానందములు స్ఫురించుచున్నవి కనుక. వస్త్రము నందు దారములకు సంబంధించిన 'తెలుపు ఎఱుపు' మొదలగు లక్షణములు ప్రతిపాదించుచున్నవి గదా! ఈవిధముగా ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడని ఊహింపవలెను. తరువాత 'ఇదంతయు బ్రహ్మమే బ్రహ్మవలన వచ్చిన కార్యము కనుక. మట్టినుండి వచ్చిన కుండ మట్టియే అయినట్లు, అని జగత్తును బ్రహ్మ స్వరూపముగా ఊహింపవలయును. మఱియు బ్రహ్మయందు మనకు గోచరించుచున్న యీ ప్రపంచము వాస్తవము కాదు. నిర్వికల్ప సమాధి మొదలగు వానియందు 'ఆత్మ' మాత్రమే సత్యముగా కనబడుచున్నది. ప్రపంచము కనబడుటలేదు. ఎట్లనగా స్వప్నప్రపంచము 'ఆత్మ' యందు కనబడుచున్నది. కాని మెలకువ వచ్చిన తర్వాత స్వప్న ప్రపంచము నశించును. కనుక అది అసత్యము అని తేలును గదా! అట్లే జాగ్రత్తులో కనబడు ప్రపంచము 'సమాధి' మొదలగు వానిలో కనిపింపదు కనుక 'జగత్తు' మిథ్య. అని ఊహింప వలయును. కాగా 'నేను దేహేంద్రియములు మొదలగు జగత్తును గాను. వాని జనన మరణములకు సాక్షిగా నున్నాను కనుక' అని తన 'బ్రహ్మత్వమును సాక్షిత్వమును గమనింపవలయును.

**వ్యాఖ్యా-72:- యద్వా సమాధ్యాదౌ దేహేంద్రియాదేః జగతః వ్యావర్తమానత్వేపి మమ అనువర్తమానత్వాత్, యథా రజ్జుః న సర్పరూపః ఇతి స్వస్య జగద్వై లక్షణ్యం చ అనుమాయ 'అహమేవ ఈశ్వరః, జగద్విలక్షణత్వాత్, యన్న జగద్విలక్షణమ్ న తదీశ్వరః, యథా మాయా' ఇతి. స్వస్య ఈశ్వరత్వం చ అనుమాయ 'సద్రూపోహం కాలత్రయాబాధ్యత్వాత్ వ్యతిరేక దృష్టాన్తే న జగద్వదితి; చిద్రూపోఽహం అపరప్రకాశ్యత్వే సతి సర్వప్రకాశకత్వాత్, వ్యతిరేక దృష్టాంతే న జగద్వదితి; ఆనందరూపోఽహం పరమప్రేమాస్పదత్వాత్ శిష్టం పూర్వవత్ ఇతి స్వస్య సచ్చిదానంద రూపత్వం చ అనుమాయ,**

**చాతురీ-72:-** లేదా, సమాధి మొదలగు వానిలో దేహేంద్రియములు, జగత్తు తొలగిపోవును. కాని 'నేను' అను ఆత్మ తొలగదు. ఎలాగంటే, రజ్జువును చూసి పాము అనుకొన్నచో భ్రాంతితొలగినపుడు పాము తొలగును. రజ్జువు నిలుచును. అది వాస్తవము. మధ్యలో వచ్చినది భ్రాంతి. అది మధ్యలో-తొలగి పోవును. కనుక తొలగిన సంసారము అసత్యము. తొలగని 'నేను' సత్యము. కనుక 'జగత్తు వేఱు-నేను వేఱు' అని ఊహింపవలయును. 'నేనే ఈశ్వరుడను, జగత్తుకన్న భిన్నముగానున్నాను కనుక, జగత్తు కన్న భిన్నముకానిది ఈశ్వరుడు కాదు. మాయ అటువంటిదే. అని తన ఈశ్వరత్వమును ఊహింప వలయును. 'నేను సత్యరూపుడను మూడుకాలముల యందు నేను ఉన్నాను. కనుక ప్రపంచము మూడు కాలములందు లేదు కనుక వ్యతిరేక దృష్టాంతము అనగా ప్రపంచము అసత్యము. నేను జ్ఞానస్వరూపుడను. నన్ను గుర్తించుటకు ఇతర పదార్థములు అవసరము లేదు. నేనే ఇతర పదార్థములను గుర్తింపజేసెదను. దీపమువలె. కాని ప్రపంచము తనను తాను గుర్తింపదు. ఆత్మను గుర్తింపదు. దానిని 'ఆత్మ' గుర్తింపజేయవలయును. అని తన స్వరూపమును 'జగత్' స్వరూపమును గుర్తింపవలయును. అట్లే, 'నేను ఆనంద స్వరూపుడను, నాకు నాయందే పరమప్రేమ కనుక' అని తనను సచ్చిదానందరూపునిగా గుర్తింపవలెను.

**వ్యాఖ్యా-73:- అద్వితీయోహం సమాధ్యాదౌ మయి ద్వైతానుపలంభాత్. వ్యతిరేకదృష్టాంతే దేహేంద్రియాదివత్, ఇతి స్వస్య అద్వయబ్రహ్మ రూపత్వం**

**చానుమాయ 'నిత్యముక్తోహమద్వితీయత్వాత్, ద్వితీయాద్ధి బంధః. యథా రజ్జునా పశోః, ఇతి నిత్యముక్తత్వం చ అనుమాయ 'స్వస్థో భవేజ్జీవః' ఇతి యౌక్తికోపి అయం ఆత్మతత్త్వవిచారః శ్రౌత ఏవ.**

**చాతురీ-73:-** నేను అద్వితీయుడను అనగా అఖండుడను ఒక్కడినే. సమాధి మొదలగువానిలో ఈ '2'వ దయిన దేహాది ప్రపంచము కనబడుటలేదు. ఈవిధముగా తాను 'అద్వితీయ బ్రహ్మమునని' గమనింపవలయును. 'నాకు '2'వ వాడు లేదు కనుక నాకు బంధములు భయములు లేవు. బంధములు గాని భయములుగాని '2' వ వానివలన గదా! రజ్జువు వలన పశువునకు బంధముగలుగును. పశువువలన పశువునకు బంధము లేదు గదా! అట్లే ఆత్మవలన ఆత్మకు బంధము లేదు. కనుక తాను నిత్యముక్తుడనని విచారణ చేయవలయును. ఈ విచారణ ద్వారా జీవుడు స్వస్థుడు అనగా స్వస్వరూప జ్ఞానముగలవాడు కావలయునని భగవంతుని ఆశయము. అదే 'అన్వయ వ్యతిరేకముల ద్వారా' విచారింపవలయునని చెప్పిన దానికి అర్థము. యుక్తి పూర్వకమయిన యీ విచారణ శ్రుతిచేత గూడా ప్రతిపాదింపబడినదే.

**వ్యాఖ్యా-74:-తథాహి, 'యతో వా ఇమాని భూతాని జాయంతే', 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ', 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్', 'సర్వం ఖల్విదం బ్రహ్మ', 'సాక్షీ చేతా నిర్గుణః కేవలశ్చ', 'అహం బ్రహ్మాస్మి', 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' ఇత్యాదీనాం శ్రుతీనాం సత్త్వాత్-ఇతి.**

**చాతురీ-74:-** చూ॥ 'దేనినుంచి యీ భూతములు పుట్టుచున్నవో' 'బ్రహ్మము సత్యము జ్ఞానము అనంతము' 'ఆనందమే బ్రహ్మమని - తెలిసికొనెను' 'ఇదంతయు బ్రహ్మమే' 'సాక్షి జ్ఞానము కేవలము నిర్గుణము' 'నేను బ్రహ్మమును' 'బ్రహ్మకు '2'వ వాడు లేదు. అది అద్వితీయము ఏకము' మొదలగు వేదముల అర్థమునే పై యుక్తులతో మననము చేయుచున్నాము. 'మంతవ్యః' అనియు వేదమే చెప్పినది. కనుక ఈ విచారణమంతయు వేద సమ్మతము. వేదప్రోక్తము.

'సమస్తము హయగ్రీవార్పితము'

'రామకవిపండితుడు వ్రాసిన భాగవత చతుశ్శ్లోకీ వ్యాఖ్య' సమాప్తము

'క్రోధి నిజజ్యేష్ఠ శుద్ధ ద్వాదశి'

శ్రీః

# భాగవతచతుశ్శ్లోకీ

మన్త్రవ్యాఖ్య

దోర్బల విశ్వనాథశర్మ

శ్లో॥ అహమేవాసమేకోఽగ్రే
నాన్యద్యత్సదసత్పరమ్।
పశ్చాదహం యదేతచ్చ
యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్॥ 1

**పదవిభాగము:-** అహమ్-ఏవ-ఆసమ్-ఏకః-అగ్రే-న-అన్యత్-యత్-సత్-అసత్-పరమ్-పశ్చాత్-అహమ్-యత్-ఏతత్-చ-యః-అవశిష్యతే-సః-అస్మి-అహమ్.

**ప్రతిపదార్థము:-** అగ్రే=తొలుత, అహమ్=నేను, ఏకః ఏవ=ఒక్కడనే, ఆసమ్=ఉంటిని, అన్యత్=మరొక, సత్=ఇంద్రియములచే ఉన్నట్లు తెలియబడునది గాని, అసత్=ఇంద్రియములచే లేనట్లు తెలియఁబడునదిగాని (సదసత్=సత్త్వము, అసత్త్వము రెండునుగల) పరమ్=(సత్తును అసత్తును కాని) మరొకటిగాని, యత్=ఏదో, తత్=అది, న=లేదు, పశ్చాత్=పిమ్మట (భవిష్యకాలమున), యః=ఏ, అహమ్=నేను, ఏతత్చ=వర్తమానకాలమునందలి (కనఁబడుచున్నది), యత్=ఏదిగాని, అవశిష్యతే=మిగులునో, సః=అది, అహమ్=నేను, అస్మి=ఉన్నాను.

**తాత్పర్యము:-** జగత్సృష్టికి పూర్వమున్న వాడను, జగత్ప్రలయమునకనంతరము ఉండువాడను నేనొకడనే! వర్తమాన జగత్స్థితియందు కనఁబడుచున్న జగత్తును కూడ నేను అయియున్నాను.

**వివరణము:-**

1. భూతభవిష్యద్వర్తమాన కాలములందున్నది నారాయణుడే. పరమాత్మయే. క్షేత్రజ్ఞుడే. ఆత్మయే. పైన పేర్కొనఁబడిన పేర్లన్నియు ఏకవస్తు బోధకములే.

జగమునందలి వస్తుత్వము లేక సత్త ఆ ఏకమునకు చెందినదే. జగత్తు నందున్న వస్తుత్వము పారమార్థికము కాదు. పరమాత్మ వస్తుత్వమే జగద్గతముగా వ్యవహరింపఁబడుటచే జగత్తునందున్నది వ్యావహారిక సత్తయే అని చెప్పవలెను.

త్రాడునందున్నది వ్యావహారిక సత్తయే. అది సర్పముగా అజ్ఞానునకు భాసించునపుడు ప్రాతిభాసిక సత్త అని చెప్పఁబడును. త్రాడునందలి సత్తయే సర్పమునందు భాసించుటచే సర్పగత సత్త ప్రాతిభాసిక సత్త అని చెప్పఁ బడును. త్రాడునందు కానఁబడు ఆ అనిర్వచనీయ సర్పము కనఁబడుకాలమున కన్న ముందటి భూతకాలమునగాని త్రాడు అను జ్ఞానము కలిగిన పిమ్మట అనగా భావికాలమున గాని లేకపోవుటచే అది వర్తమాన కాలమున కూడ లేదనియే చెప్పవలెను. అట్లే వ్యావహారికమైన జగము కనఁబడు కాలమునకు పూర్వము అనగా భూతకాలమున కాని, పారమార్థిక బ్రహ్మజ్ఞానము కలిగిన పిమ్మటగాని ఉండునట్టిది కాకపోవుటచే కనఁబడు కాలమున గూడ ఆ జగము లేదనియే చెప్పవలెను. అందుకే ఈ శ్లోకమున ఈ కనఁబడునదియు (జగమున) నేనే అయి ఉన్నానని చెప్పఁబడినది.

2. అహమ్ శబ్దముతో ఆరంభమై అహమ్ శబ్దముతోడనే అంతమగు ఈ శ్లోకమున జగము యొక్క ఆదియు అంతమును అహం శబ్దార్థమైన పరమాత్మ యందే అని, జగము యొక్క మధ్యకాలిక స్థితియు ఆభాస మాత్రమే అనియు జగద్బోధక మైన ఏతత్ శబ్దము శ్లోకము యొక్క నడుమ ఉండుటచే వ్యంజింపఁ బడుచున్నది. చకారము ఆభాస రూపమై మధ్యకాలిక స్థితి గల జగము వాస్తవమున పరమాత్మయే అని బోధించుచున్నది. అహమ్ శబ్దము శ్లోకము యొక్క ఆది మధ్య అంతములలో నుండుటచే జగము యొక్క ఆది మధ్యాంతములు (ఆదిమధ్యాంతరహితుడైన) పరమాత్మ రూపములే అని స్ఫురింపఁజేయఁబడుచున్నది.

అవశిష్యేత అను క్రియాపదము ఆ పరమాత్మ సర్వ విశేష నిషేధ శేష రూపమని అనగా నేతినేతి అనువిధముగా బోధింపఁబడునదే కాని ఇదియని నిర్దేశింపరానిదని వ్యంగ్యమగుచున్నది. సః అస్మి అహమ్ అనుపదములు సోహమస్మి బ్రహ్మోహమస్మి ఇత్యాది శ్రుతి ననువచించుచున్నవి. శ్రీమద్భాగవత

ద్వితీయస్కంధోపాంతిమాధ్యాయ మందలి నారాయణోపదిష్టమైన చతుశ్శ్లోకీ భాగవతమున ఈ తొలి చతుష్పాత్ శ్లోకమందలి అహమ్ శబ్దము మాంఢూక్యోపనిషత్తున చెప్పఁబడిన చతుర్థ పాద స్వరూపమైన జీవేశ్వర భేద రహితమైన నారాయణుని శుద్ధాత్మ స్వరూపమును నిరూపించుచున్నది. చెప్పునట్టి నారాయణుడీశ్వరుని నామరూప ధరావతారము. ఈ శ్లోకమందలి మూడు అహం శబ్దములు 1) జీవేశ్వర జాగ్రదవస్థాభిమాని విశ్వవైశ్వానరులను 2) తత్స్వప్నావస్థాభిమాని తైజస హిరణ్యగర్భులను, 3) తత్సుషుప్త్యవస్థాభిమాని ప్రాజ్ఞావ్యా కృతులను బోధించును. సోస్మ్యహమ్ అను పదములలోని ఆద్యంతా క్షరములు హల్లులు తొలగించగా మిగులు ఓంకారము యొక్క అర్థమే ఈ ఆత్మచతుష్పాత్త్వమని వాస్తవమైన జీవేశ్వరైక్యమును అస్మి పదము బోధించును. సోహం శబ్దములు లక్షణావృత్తిచేతనే గాక అద్వైతులలోని కొందఱి సిద్ధాంతము ననుసరించి అభిధావృత్తి చేత సైతము శుద్ధాత్మనే బోధించుననియు స్ఫురింపఁ జేయఁబడుచున్నది. మొత్తము మీద ఈశ్లోకమున ఆత్మస్వరూపము నిరూపించఁ బడినది.

3. ఏకోగ్రే అను ప్రథమ పాదాంతపదములు క, ఏ, ఈ ల (రలయోరభేదః అను న్యాయముననుసరించి) అను పంచదశీమంత్రమునందు మొదటిదైన వాగ్భవకూటమందలి మొదటి నాల్గక్షరములను (క్రమముగా లేకపోయినను ఏక (క ఏ) ర(ల) + ఈ = రే (ఈల)) ఉద్ధరించును.

4. పూర్వార్థమందలి ఆద్యంతములైన అహంపరం అను పదములు హ్రీం కారములోని హ్ ర్ మ్ అను హల్లులను ఏవ శబ్దములోని ఏకారగర్భములోని ఈ హ్రీంకారములోని ఈకారమును ఉద్ధరించును. ఇట్లు విడిగా ఈకార ముద్ధరింపఁబడుట పంచదశీమంత్రమూలమైన కామ కలయొక్క ప్రాధాన్యమును, అది మొదటి అహం శబ్దము యొక్క అనంతరమందే అగుటచేత అహం శబ్దములోని 'అ' కార 'హ' కారములు ఊర్ధ్వబిందువును, తదధఃస్థితములైన విసర్గరూప బిందుద్వయమును సూచించును. ఇట్లే ఈశ్లోకమందలి హసాద్య క్షరములు ద్వితీయ తృతీయ కూటములనుద్ధరించుకొనవచ్చునని సూచించును. అట్లే రేఫ గకారోకారములు గాయత్రీ ప్రథమపాదమందలి 'ర్గో' ను సూచించును.

5. ప్రథమ పాదములోని నాల్గవ అక్షరము 'వా', ద్వితీయ పాదమందలి 'స' కారము చతుర్థపాదమందలి 'యో' అనుపదములో గర్భితమైన 'ఉ' కారముతో కూడి 'సు' అను అక్షరము, మూడవ పాదమందలి ఆరవ అక్షరము 'దే', నాల్గవ పాదమందలి రెండవ అక్షరము 'వ' నారాయణుని చతుర్వ్యూహములలోని చతుర్థమైన 'వాసుదేవ' వ్యూహమును సూచించును.

మొదటి పాదమందలి 'క' కారానంతరిక 'ఓ' కారము మూడవ అక్షరమైన 'మే' లోని 'మ' కారముతో కూడి 'ఓం' కారమును, ద్వితీయ పాదమందలి మొదటి అక్షరమునైన 'న', నాల్గవ పాదమందలి చివరి 'మ' కారముతో కూడి మొదటి యో శబ్దములోని ఓ కారముతో కూడి 'మో' అను అక్షరమును సూచించును. ఇట్లు ద్వితీయ పాదమందలి ఆ 'య' కారముతో కూడి వాసుదేవ ద్వాదశాక్షర మహామంత్రములోని 'ఓం నమో వాసుదేవాయ' అను అష్టాక్షరములు ప్రథమ శ్లోకమున ఉద్ధరింపఁబడినట్లైనది.

6. శ్రీమద్భాగవతము గాయత్రీ సమారంభలక్షణకమని పురాణములు చెప్పుటచే ఈ శ్లోకము యొక్క ద్వితీయపాదమందలి అన్యత్+ యత్స అనువానిలోని 'తకారా' కారములు గాయత్రీ ప్రథమపాద ప్రథమాక్షరము 'త' అను దానిని అందలి ద్వితీయాక్షరమునుద్ధరించునని చెప్పవచ్చును. ఇట్లు వ్యాసకృత భాగవతమువలె ఈ చతుశ్శ్లోకీ భాగవతమున్ను గాయత్రీ సమారంభ లక్షణకమగు చున్నది. అట్లే 'ఓం నమో నారాయణాయ' అను అష్టాక్షర మంత్రమును, నవార్ణమంత్రమును నుద్ధరించుకొనవచ్చును.

శ్లో॥ ఋతేఽర్థం యత్ప్రతీయేత
న ప్రతీయేత చాత్మని।
తద్విద్యాదాత్మనో మాయాం
యథాభాసో యథా తమః॥ 2

**పదవిభాగము:-** ఋతే-అర్థం-యత్-ప్రతీయతే-న-ప్రతీయతే-చ-ఆత్మని-తత్-విద్యాత్-ఆత్మనః-మాయామ్-యథా-ఆభాసః-యథా-తమః.

**ప్రతిపదార్థము:-** అర్థం ఋతే=వస్తువులేకుండ, యత్=ఏది, ప్రతీయతే=

గోచరించునో, ఆత్మని=ఆత్మయందు, న ప్రతీయతే చ=గోచరింపకయుండునో, తత్=అది, ఆత్మనః=ఆత్మయొక్క, యథాభాసః=కించిత్‌భాసనమెట్టిదో, యథా తమః=చీకటివలె ఏమియు ప్రకాశించకపోవుట యెట్టిదో, తత్=అది (ఆ రెండు స్థితులను), మాయామ్=మాయనుగా, విద్యాత్=తెలుసుకొనవలెను.

**తాత్పర్యము:-** వస్తువు లేకుండ గోచరించు స్థితి ఆభాసము. ఏదియు గోచరించక పోవుట తమస్సు. ఈ రెండు స్థితులును ఆత్మ యొక్క మాయ అని తెలియవలెను.

**వివరణము:-**

1. భాసమనగా ప్రకాశము. సత్యవస్తు సాక్షాత్కారము. ఆభాసము అనగా కొంచెము ప్రకాశించుట. యథార్థము కానిది స్ఫురించుట; తమస్సు అనగా ఏమియు స్ఫురింపక పోవుట. ఆభాస శబ్దము భ్రాంతిని (విక్షేపమును), తమః శబ్దము అజ్ఞానమును (ఆవరణమును) బోధించును. ఇవి రెండు మాయ యొక్క శక్తులు. బ్రహ్మము తెలియక పోవుట, బ్రహ్మము ఆవరింపబడుట ఆత్మ యొక్క (బ్రహ్మము యొక్క) ఆవరణశక్తియని, యథార్థమైన బ్రహ్మమునకు బదులు అయథార్థమైన జగత్తు స్ఫురించుట విక్షేపశక్తియని చెప్పఁబడును. మొత్తము మీద ఈ శ్లోకమున ఆత్మ యొక్క మాయాశక్తి నిరూపింపఁబడినది.

2. ఈ శ్లోకమందలి నాల్గవ పాదములోని 3వ అక్షరము 'భ', మొదటి శ్లోకములోని మొదటి పాదములోని అగ్రే అను పదములోని 'అగ్' అను పదాంశమునందలి వ్యుత్క్రమమున సిద్ధించిన 'గ' నాల్గవ పాదములోని 'అవశిష్యతే' అను పదములోని 'వ' ఈ శ్లోకారంభమునందలి 'ఋతే' శబ్దములోని 'తే' అనునవి వాసుదేవ ద్వాదశాక్షరిలోని 'భగవతే' అను నాల్గు అక్షరములు ఉద్ధరింపఁబడినట్లు భావింపవచ్చును. ఇందలి 'భ' గాయత్రీ మంత్రములోని ద్వితీయ పాదాద్యక్షరమును కూడ సూచించును. శ్రీమద్భాగవత మూలమంత్రము వాసుదేవ ద్వాదశాక్షరి అగుటచే మొదటి రెండు శ్లోకములలో అది ఉద్ధరింపఁబడినట్లు భావించుకొనుటలో అనౌచిత్య మేమియు లేదు.

3. 'మాయాన్తు ప్రకృతిమ్ విద్యాత్ మాయినంతు మహేశ్వరమ్' అను సూక్తి ననుసరించి ప్రకృతి, మాయా శబ్దములు ఆత్మ శక్తిని, మహేశ్వరాత్మ శబ్దములు

ఆత్మను బోధించుననుట **'శక్తి శక్తిమతోరభేదః'** అను సూక్తి ననుసరించి మాయ ఆత్మకు అనన్యమనుటయు స్పష్టములు. రజ్జువు (త్రాడు) యొక్క అజ్ఞానము యొక్క పరిణామమైన సర్పమువలె మాయా పరిణామమైన పంచభూతాత్మకమైన జగత్తు అనిర్వచనీయము. అనిర్వచనీయమైన జగమునకు మాయ మాతృస్థానీయము. ఋతే అర్థమ్ అను శబ్దములోని మకారము, రెండు అకారములు కలిసియేర్పడు 'ఆ' కారము, 'తే' అను అక్షరములోని తకారము మొదటి ఋకారము 'తే' లోని ఏకారమును వ్యుత్క్రమమున చతుర్థ్యంతమైన 'మాత్రే' అనుపదమును ద్వితీయ పాదాదియందలి 'న' అను అక్షరము చతుర్థ పాదాంత మందలి 'మః' అను అక్షరమును కూడి **మాత్రే నమః** అను మంత్రము నుద్ధరించునని భావించుటలో అనౌచిత్యము లేదు.

**శ్లో॥ యథా మహాన్తి భూతాని**
**భూతేషూచ్చావచేష్వను।**
**ప్రవిష్టాన్యప్రవిష్టాని**
**తథా తేషు న తేష్వహమ్॥ 3**

**పదవిభాగము:-** యథా-మహాంతి-భూతాని-భూతేషు-ఉచ్చావచేషు-అను-ప్రవిష్టాని-అప్రవిష్టాని-తథా-తేషు-న-తేషు-అహమ్.

**ప్రతిపదార్థము:-** యథా=ఎట్లు, మహాన్తి=గొప్పవైన, భూతాని=భూతములు, ఉచ్చావచేషు=పైనను క్రిందనునున్న, భూతేషు=భూతములందు, అనుప్రవిష్టాని= అనుసరించి ప్రవేశించినవై, న అనుప్రవిష్టాని=అనుసరించి ప్రవేశించలేదో, తథా=అట్లు, తేషు=వాని (భూతముల) యందు, అనుప్రవిష్టః=ప్రవేశించిన వాడను, తేషు=వాని (భూతముల) యందు, న అనుప్రవిష్టః=ప్రవేశించని వాడను, అస్మి=అగుచున్నాను.

**తాత్పర్యము:-** మహాభూతములు పంచీకృతములై పైనను క్రిందను ఉన్న భూతముల యందు ప్రవేశించియున్నవనియు, ప్రవేశించలేదనియును ఎట్లు చెప్పవచ్చునో, అట్లు నేను (నారాయణుడను) భూతములందు ప్రవేశించి యున్నానని, ప్రవేశించకయు ఉన్నానని చెప్పవచ్చును.

వివరణము:-

1. కారణమైన మట్టి (భూమి అను భూతము) కార్యమైన కుండ (అను క్రింది భూతమున) యందు వ్యాపించియుండును. అందుచేత కారణమైన మట్టియే కార్యమైన మట్టియందు ప్రవేశించి యున్నదని కొందఱు (అసత్కార్య వాదులు) చెప్పెదరు. కాని కొందఱు సత్కార్యవాదులు మట్టికి, కుండకు (కారణకార్యములకు) భేదము లేకుండుటచే ప్రవేశించుట ఎట్లు సంభవము? అని ప్రవేశించలేదందురు. ఇట్లే పంచ మహాభూతములు తమ కార్యములలో ప్రవేశించియున్నవని, ప్రవేశించకయే, యుండునని చెప్పుదురు. అట్లే సర్వ భూతములకు నిమిత్తోపాదాన కారణభూతుడైన పరమాత్మ తన కార్యములైన పంచ మహాభూతములందు ప్రవేశించి యుండునని, ప్రవేశింపకయే ఉండునని గమనింపవలెను.

2. నిమిత్త కారణమనగా కార్యమందు వ్యాపింపక కార్యము యొక్క ఉత్పత్తికి నిమిత్తమైన కారణము. కుమ్మరి కుండకు నిమిత్త కారణమైనను కుండలో వ్యాపించి యుండదు. కుండకు కుమ్మరి నిమిత్త కారణమని చెప్పఁబడును. మట్టిలేనిదే కుండ పుట్టదు. మట్టి కుండయందు వ్యాపించి యుండును. మట్టి వ్యాపించక కుండ యుండదు. కావున కార్యమైన కుండ యందు వ్యాపించి యున్న మట్టి ఉపాదాన కారణమని చెప్పఁబడును. సంకల్ప(యత్న)ము ద్వారా జగమునకు నిమిత్తమైన భగవానుడు జగత్కర్త యనఁబడును. లోకమున కర్తలు (కుమ్మరి మొదలగువారు) సంకల్ప యత్నముల ద్వారా కారణమగుదురు. వారు నిమిత్త కారణ రూపులే కాని మట్టి మొదలగు భూతములవలె ఉపాదాన కారణము కాజాలరు. కాని జగమునకు కర్తయైన భగవానుడు మాత్రము సాలెపురుగు సాలెగూడునకు వలె నిమిత్త కారణమును, ఉపాదాన కారణమును అగును. అని వేదాంత శాస్త్రజ్ఞులచే అంగీకరింపఁబడినది. భూతములచేతనము లగుటచేత వాని కుపాదాన కారణత్వము యుక్తమే కాని, చేతన మాత్ర నిష్ఠమైన కర్తృత్వము అచేతనములైన వానికి సంభవించదు. కర్తలకు నిమిత్త కారణత్వముచితమే కాని ఉపాదనకారణములకు వలె కార్యవ్యాపిత్వము సంభవించదు. ఈ శ్లోకమున నారాయణుడు కర్త యగుటచే భూత సృష్టి

యందు నిమిత్త కారణమగుట కభ్యంతరము లేదు. కాని అచేతన భూతములకు తమ కార్యములందు వ్యాప్తియున్నట్లు చేతనులైన కుమ్మరి మొదలగు కర్తలకు భూతములందు వ్యాప్తి ఉండనక్కఱలేదు. కాని తనకు (నారాయణునకు) మహా భూతములకు వలె ప్రవేశాప్రవేశములు చెప్పఁబడుటచే ఉపాదాన కారణత్వము చెప్పఁబడినట్లైనది. ఇట్లు సాలెపురుగు సాలెగూడునకు వలె నారాయణునకు నిమిత్తకారణత్వము, ఉపాదానకారణత్వము నున్నవని (ఇది వేదాంతుల సిద్ధాంతము) ఈ శ్లోకమున నిరూపింపఁబడినట్లైనది. వాస్తవమునకు భూత ప్రవేశాప్రవేశములు పరస్పరవిరుద్ధములు. అవి ఇట నారాయణ సంగతములుగా పేర్కొనుట ఉద్దిష్టము కాదు. భూతములు బ్రహ్మ వివర్తములని చెప్పుటయే ఉద్దిష్టము. వివర్తాధిష్ఠానము బ్రహ్మము. భూతములు తద్వివర్తములు. అజ్ఞానుల దృష్టిలో జగత్తు గోచరమగును. జ్ఞానుల దృష్టిలో బ్రహ్మము గోచరమగును. దృష్టి భేదముచే ఏక వస్తువే, బ్రహ్మమే, జగ ద్రూపముగా బ్రహ్మరూపముగా భిన్నముగా కనఁబడినప్పుడు బ్రహ్మ జగత్తులకు కార్యకారణ భావము చెప్పుటకన్న అభేదభావము చెప్పుటయే సమంజసము. కావున ఈ శ్లోకమున బ్రహ్మము (నారాయణుడు) భూతములకు వివర్తోపాదాన మని పై శ్లోకమున నిరూపింప బడిన మాయ పరిణామోపాదాన మని నిశ్చయించుకొనవలెను.

3. ఈ శ్లోకము ఈ విషయమునే నిశ్చయించుచున్నది. ఒకడు త్రాడును పామనుకొనెను. అతనికి త్రాడును తెలిసికొనజాలని అజ్ఞానము కారణముగా సర్పభ్రాంతి కలిగినది. ఈ పాము ఎచట నున్నది? త్రాడునందే ఉన్నది. త్రాడు యొక్క సత్తయే పామునందు ప్రవేశించినది. కావుననే లేని పాము ఉన్నట్లు అజ్ఞానునకు తోచినది. భయపడు ఆ అజ్ఞానికి ఇది పాముకాదు త్రాడే అని జ్ఞాని చెప్పెను. అప్పుడజ్ఞానమింత వఱకు కలవాడు ఇప్పటి వఱకు తనకు కనపడిన పాము అసలు లేనిదే అగుటచే త్రాడు యొక్క సత్త పామునందు ప్రవేశించినదని చెప్పనక్కఱయే లేదని గ్రహించును. జ్ఞానిదృష్టిలో పామే లేనప్పుడు పామునందు త్రాడు యొక్క సత్త యొక్క ప్రవేశమును లేదు.

ఇట్లు ప్రవేశా ప్రవేశములు పరస్పర విరుద్ధములైన ఏకవస్తువు (బ్రహ్మము); జ్ఞానులకు బ్రహ్మముగా, అజ్ఞానులకు భూతములు (జగము) గా కనఁబడు

చుండుటచే అజ్ఞానుల దృష్టిలో భూతములందు బ్రహ్మము యొక్క ప్రవేశము జ్ఞానుల దృష్టిలో దాని అప్రవేశము సమంజసములే అగుచున్నవి. ఈ సామంజస్యము భిన్నకార్యకారణములందు సంభవింపదు. ఇట్లీ శ్లోకమున భూతములందు బ్రహ్మ ప్రవేశాప్రవేశములు దృష్టి భేదాశ్రయణమువలన (విరోధములేని వగుటచే) సమంజసములని గ్రహించుట ఆవశ్యకము. బ్రహ్మము దాని సత్తయు భిన్నములు కావు. బ్రహ్మ స్వరూపమే సత్త. అది బ్రహ్మము యొక్క స్వరూపమే కావున బ్రహ్మ సత్త ప్రవేశాప్రవేశములే బ్రహ్మ ప్రవేశాప్రవేశములు అనియు గ్రహింప వలసియున్నది.

4. ఈ శ్లోకమునందు ద్విరుక్త భూతశబ్దములలో నొకటి 'భూః' అను వ్యాహృతిని, మరొకటి భువః అను వ్యాహృతిని 'నతేష్వహమ్' అనుదానిలో 'స్వః' అను వ్యాహృతిని, హకారములోని విసర్గ స్వరూపముతో కూర్చుకొని ఉద్ధరించు కొన వచ్చును. గాయత్రీ సమారంభము భాగవత లక్షణముగా పురాణములు పేర్కొనుటచే ఇట్లుద్ధరించుకొనుట ఉచితమే అగుచున్నది. ఓంకారమును ప్రథమ శ్లోకమున ఉద్ధరించు కొనవచ్చునని ఇదివఱకే చెప్పఁ బడినది.

కావున జప్య గాయత్రికి ఓంకార వ్యాహృతి త్రయములు పూర్వముండుట ఆవశ్యకమగుట చేతను ఈ ఉద్ధారము ఉచితమే అగుచున్నది. నారాయణ మహర్షిచేత చతుర్ముఖున కుపదేశింపఁబడిన ఈ చతుశ్శ్లోకీ భాగవతము వ్యాసకృత భాగవతమునకు పూర్వము మూలమునగుటచే దానికి గాయత్రీ సమారంభరూప లక్షణమును కూడ ఈ శ్లోకము సమకూర్చు చున్నది. ఈ వ్యాహృతి త్రయము గాయత్రీ పాదత్రయమునకు మూల మనుటయు విజ్ఞులెఱిగిన విషయమే. ప్రవిష్ట శబ్దమునందలి 'వి' గాయత్రీ ప్రథమపాదగత 'వి' కారమునుద్ధరించుననుట స్పష్టమే.

'భూతేషు' అను శబ్దములోని 'త' కారము చివఱ ఉకారముతో కూడి గాయత్రీ ప్రథమపాద మందలి 'తు' అను అక్షరమునుద్ధరించుటను కూడ గమనింపవచ్చును. పూర్వార్ధాంత మందలి 'ని' అను అక్షరము ఆ గాయత్రి ప్రథమ పాదమందలి సప్తమాక్షరమును సూచించును.

శ్లో॥ ఏతావదేవ జిజ్ఞాస్యం
తత్త్వజిజ్ఞాసునాత్మనః।
అన్వయవ్యతిరేకాభ్యాం
యస్స్యాత్సర్వత్రసర్వదా॥ 4

**పదవిభాగము:-** ఏతావత్-ఏవ-జిజ్ఞాస్యమ్-తత్త్వజిజ్ఞాసునా-ఆత్మనః-అన్వయ వ్యతిరేకాభ్యామ్-యః-స్యాత్-సర్వత్ర-సర్వదా.

**ప్రతిపదార్థము:-** ఆత్మనః=ఆత్మ యొక్క, తత్త్వజిజ్ఞాసునా=తత్త్వమును తెలిసికొన గోరినవాని చేత, అన్వయ వ్యతిరేకాభ్యామ్=ఆత్మ సత్త యొక్క సర్వ పదార్థాను వృత్తి అను అన్వయముచేత, ఇతర పదార్థముల సత్త యొక్క అననువృత్తి లేక వ్యభిచారము అనఁబడు వ్యతిరేకము చేత, యః=ఏది (ఆత్మ), సర్వత్ర= అన్నిదేశములందును, సర్వదా=అన్ని కాలములందును, స్యాత్=ఉండునో (అట్టి ఆత్మ యొక్క తత్త్వము), ఏతావత్ ఏవ=ఇంతయే, జిజ్ఞాస్యమ్=తెలిసికొనఁ దగినది.

**తాత్పర్యము:-** ఆత్మ సర్వకాలములందును ఉండుటచే కాలము చేతను, అన్ని దేశములందును ఉండుటచే దేశము చేతను-పరిచ్ఛిన్నము కానిది. ఆత్మతత్త్వము అన్వయ వ్యతిరేకముల ద్వారమున ఇంత మాత్రమే తెలిసికొనదగినది.

**వివరణము:-**

1. ఆత్మ దేశకాల పరిచ్ఛేద రహితము అనుట వస్తు పరిచ్ఛేద రహితమైన దనుటకును ఉపలక్షణమని గ్రహింపవలసి యున్నది. అప్పుడు ఆత్మ త్రివిధ పరిచ్ఛేద శూన్యమను వేదాంత సిద్ధాంతము ఈ శ్లోకమున చెప్పఁబడిన దగును.

2. అన్వయమనగా ఒకటి ఉన్నచో మరొకటి ఉండుట. పొగ ఉన్నచో నిప్పు ఉండుట అనునది అన్వయ (వ్యాప్తి) అని, వ్యతిరేకమనగా ఒకటి లేనిచో మరొకటి లేకుండుట. నిప్పు లేనిచోట పొగ ఉండక పోవుట వ్యతిరేక (వ్యాప్తి)ము అని తార్కికులు నిర్వచించెదరు. కాని నిత్య పదార్థమైన బ్రహ్మము లేనిచో జగత్తు ఉండదు అను వ్యతిరేక (వ్యాప్తి) సంభవింపదు. కావున ఇట అన్వయ వ్యతిరేక శబ్దములు తార్కికుల వ్యాప్తులను బోధించవు. సర్వదేశకాలములందలి

పదార్థములలోను బ్రహ్మ యొక్క సత్త అనువర్తించుననుట అన్వయముగా, ఇతర పదార్థముల సత్త అట్లనువర్తించక వ్యభిచరించుననుట వ్యతిరేకముగా, ఇట గ్రహింపవలసియున్నది. కుండ ఉన్నది. గుమ్మి ఉన్నది అను వ్యవహారము లతో సద్రూప(బ్రహ్మ)ము ఉన్నది అనురూపమున అనువర్తించుచున్నది. కుండ లేదు, గుమ్మి లేదు అను వ్యవహారములో కుండ, గుమ్మి మొదలగు పదార్థముల సత్త వ్యభిచరించుచున్నది. కుండ, గుమ్మి మొదలగు పదార్థములనిత్యములగుట చేత వాని ఉనికి (సత్త) వ్యభిచరించును. అట్లు సర్వవ్యాపకమైన ఆత్మ (సత్త) కు వ్యభిచారము లేదు. ఇట్లు అన్వయ వ్యతిరేక శబ్దములలో అన్వయశబ్దము బ్రహ్మ సత్త యొక్క సర్వదేశ కాలగత పదార్థములందలి అనువృత్తిని, వ్యతిరేక శబ్దము, ఇతర పదార్థములసత్త లట్లనువర్తింపక వ్యభిచరించుటను బోధించును.

3. ఏతావత్ అను పదములో దీర్ఘాకారముతో కూడిన 'వ' కారము 'వాసుదేవాయ' అను ద్వాదశాక్షర మంత్రాంత పదములోని మొదటి 'వా' కారమును 'జిజ్ఞాసునా' అను పదములోని సుకారము 'సు' కారమును 'ఏతావదేవజిజ్ఞాస్యమ్' అను పదములోని సంధిగతమైన 'దే' దేకారమును, తదనంతర వకారము 'జిజ్ఞాస్యమ్' లోని ఆకారముతో కూడి రెండవ వాకారమును దాని పిమ్మట 'యమ్' లోని యకారము యకారమును ఉద్ధరించును. ఆత్మనః అను శబ్దములోని 'మనః' అను అక్షరములు వ్యుత్క్రమమున 'నమః' అను పదమును ఉద్ధరించును. పూర్వము ఒక విధముగా 'వాసుదేవాయ' అను ద్వాదశాక్షర మంత్రములోని చివరి రెండు పదములు ఉద్ధరింపఁబడినవి. ఇప్పుడు మరొక విధముగా వాని ఉద్ధారము చూపఁ బడినది. శ్రీ మద్భాగవతగత వాసుదేవ ద్వాదశాక్షర మంత్రవ్యాప్తిని సూచించుటకే నాల్గవ శ్లోకమున ప్రకారాంతరముగా సూచింపఁబడినది.

4. శ్లోకాంత పదములలోని 'ర్వ' గాయత్రీ ప్రథమ పాదచతుర్థాక్షరమును వ్యతిరేక శబ్దములోని 'రే' ఆ పాదమందలి ఆరవ అక్షరమును 'జిజ్ఞాస్యమ్' అను పదములోని చివరి 'యమ్' ఆపాదమందలి 8వ అక్షరమును, 'ఏతావదేవ' అను పదములోని 'దేవ' అను అక్షరములు గాయత్రీ ద్వితీయ పాదమందలి ఏకాదశ ద్వాదశాక్షరములను 'జిజ్ఞాస్యమ్' అనుదానిలోని 'స్య' అనునది ఆ

పాదమందలి త్రయోదశాక్షరమును ఆత్మనః అను శబ్దములోని 'మ' అనునది ఆపాదమునందలి పంచదశాక్షరమును 'నః' అనునది గాయత్రీ తృతీయ పాద మందలి ఏకవింశతి తమాక్షరమును 'స్యాత్' శబ్దములోని 'యాత్' అనునది గాయత్రీ మంత్రము నందలి అంతిమాక్షరము నుద్ధరించును. అట్లే అన్వయ వ్యతిరేక శబ్దములలోని రెండు యకారములు ఇరువది రెండవ, ఇరువది మూడవ అక్షరములను సూచించును. గాయత్రి యందలి దీర్ఘ హ్రస్వధికా . ములు నుద్ధరించుట సాధ్యము కాకపోయినను ఇన్ని అక్షరములుద్ధరింపఁబడి నప్పుడవి ఉద్ధరింపబడక పోయినను పాఠకుల మనస్సులలోనవి స్ఫురించుచునే ఉండును. ఇట్లీ చతుశ్శ్లోకీ పైన పేర్కొనఁబడిన మంత్రములనే గాక అభిరుచి ననుసరించి ఇతర మంత్రముల యొక్క ఉద్ధారమును కూడ సూచించును. మచ్చునకొక దృష్టాంతము. మొదటి శ్లోకములోని మొదటి పాదములోని 'వా' మూడవ పాదములోని 'య' అనువానికి నాల్గవ పాదములోని 'శి' ని మధ్యన చేర్చినచో 'శివాయ' పదము ఉద్ధరింపఁబడును. రెండవ శ్లోకములోని మొదటి పాదమును విడిచి మిగిలిన మూడు పాదములలోని ఆద్యంతములను కలిపిన 'నమః' అను పదము ఉద్ధరింపఁబడును. ఈ రెండు కలసి 'నమఃశివాయ' అను పంచాక్షరము సిద్ధించును. వెనుక చెప్పఁబడిన విధముగా మొదటి శ్లోకములో మొదటిపాదమున గాని, చివరి పాదమున గాని 'ఓమ్' అను ప్రణవము నుద్ధరించుకొని 'ఓమ్ నమః శివాయ' అను శైవ మహామంత్రమును (షడక్షరిని) ఉద్ధరించుకొనవచ్చును. శ్రీమద్భాగవతము శివద్వేషము నేమాత్రము సూచించని వైష్ణవ మహాపురాణమగుటచే తన్మూల• చతుశ్శ్లోకీ భాగవతమందు శివ మంత్రముల నుద్ధరించుకొనుటలో అనౌచిత్యమేమాత్రము లేదు.

శ్రీః

66



త్వరలో

పండిత జగన్నాథరాయవిరచిత

# సుధాలహరి

పావనీ వ్యాఖ్య

(అర్థతాత్పర్యవివరణములు :

**శ్రీ E.V. సత్యన్నారాయణమూర్తి**

శ్రీ గోరంట్ల వెంకన్న ఓరియంటల్ కళాశాల–తిమ్మసముద్రం)

తో వెలువడనున్నది.